ఓ మ్.

# వింటారులనీటుం

ఇ త్యా ది

యల్. టి. కృష్ణయ్యశాస్త్రివిరచితము.



చె న్న పు రి:

వావిళ్ల ముద్రణాలయమున

ముద్రింపఁబడినది.

1937

 మూల్యము 0-6-0.

# తొలిపలుకు.

మహాత్ములారా! "మిటూకులనీటు" అను నీకథ నాకల్పించినది కాదు. "ఆజాకీ" అను నొకకథనుండి గ్రహించితిని. పేరులు అర్థమునసుసరించి మార్చితిని. అవివేకులమాటలకుఁ జెవియొగ్గినవారు చెడుదు రనునీతినే యాకథ బోధించునని కవియాశయము. ఇద్దానిం జదివినను మదకానీతియే ప్రధానముగాఁ దేలును. చాలయేండ్లక్రిందట నీకథ వ్రాయఁబడినది. కాశ్మీరమునఁగల కథలపుస్తకములలో నిట్టి వనేకములు గలవు. వానినుండి కొన్ని సంగ్రహించితిని. 1933-వ సం॥ నందు "పాతాళద్వీపము" అను నొకకథను బ్రకటించితిని. దానిని బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారిమూలముగ ముద్రించితిని. దీనిని గూడఁ బంపితిని. కాని. కాని వారు చదువ నవకాశము చాలదనిరి. వేఱొకమిత్రులు చదివి యిచ్చిరి. వారికి వందనములు. ఎట్లైనను దీనిని ముద్రింపవలయు ననుకొని బీదవాఁడనైనను ముద్రించితిని. నాయీకార్యమునకుఁ దోడుపడినవారికిఁ గృతజ్ఞుఁడను. విశేషించి భాషోద్ధారకులగు మ-రా-రా-శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికిఁ గృతజ్ఞుఁడను. చదివి యిందలి నీతిని గ్రహించుమహాత్ములకే దీని నంకితము చేసితిని. తప్పులున్న పండితులు క్షమింతురుగాక యని కోరుచున్నాను. విశేషించి వ్రాయఁదగిన వేవియు నిందు లేవు.

ఇట్లు విన్నవించు సాధుజనదాసుఁడు,

యల్. టి. కృష్ణయ్యశాస్త్రి,

హేలాపురము.

శ్రీ ర స్తు.

# వింటారులసీటుం

## మొదటికళ.

పద్మావతిని అత్త ఆక్షేపించుట. కోడలు బదులిచ్చుట.

వీధిలోనినలువురు తగవుమాన్పుట.

పద్మావతి రోదనము.

పద్మావతీ! ఏటికే యింత మిట్టిపాటు? బ్రహ్మాయంత వానిని గవ్వకుఁ గాకయుండఁ జూచుచున్నావు? ఎవరిని లెక్క పెట్టవు. దేనినిజూచుకొని యీమిడిసిపాటు? నలువురు నవ్వుదురనియైన సిగ్గులేక తలయెత్తుకొని యేలాగున తిరుగుచున్నావో, ఔరా! ఎంతగర్వము. మాణిక్యమువంటి కాపురము మంటిపాలుచేసి అడ్డమాపులేక విసవిస తిరుగుచున్నావే. కాలము! కాలము! బంగారమువంటి పెనిమిటిని కాటిపాలుచేసి తగుదునమ్మా యని కడపపూజలు పెట్టుచున్నావు.? మగఁడు పోయెనన్నవిచారము నీకున్నదని యెవ్వరైన ననఁగలరా? నిర్విచారముగా హాయిగా తలదువ్వుకొని కీలుగంటువైచుకొని పెద్దలని పిన్నలని యెంచక కనఁబడినవారినెల్ల మాట

లాడించుచు తిరుగుచున్నావుకదా. దేనిపొగరే యిది? నీ యందము మండినట్లేయున్నది. తాంబూలము రంగలించి పక పకనవ్వుచు చూచినవారు చేటతో దిగదుడుతురనియైన ఆలో చింపక పరుగెత్తుచున్నావేమే. చుప్పనాతీ! నాకొడుకున్న పుడును వేయించుకొని బొక్కలాడితివి. పుణ్యము చేసినవాడు గాన చల్లఁగా జాఱుకొన్నాఁడు. ఇపుడు వాఁడే యుండిన నేమైయుండునో. చెప్పుక్రింద తేలువలె నపుడుండి యెట్లు చెలరేఁగితివే. నాపెండ్లా మేమి తెలియనిగోల యనుచుండు వాఁడు నాకొడుకు. నేనపుడే చెప్పితిని. వాఁడు నామాట వినకపోయెను. తోఁబుట్టువుల కానాలుగుడబ్బు లిచ్చియున్న నిపుడు నీళ్లుమోయుచుందువు. ఆపని జరగనందున నిట్లు తిరుగుచున్నావు. నిన్నుజూచి పిల్లలు నేర్చుకొందురనియైన ఊహింపవు. ఆనవ్వేమి? ఆతాంబూలమేమి? ఆకీలుగంటేమి? ఆఱవికయేమి? మెడలో నాబంగారు గొలుసేమి? చేతిలో తమలపాకులేమి? ఔరా! ఔరా! నీయందము మండినట్లే యున్నది. పకపకనవ్వు ముందు, మాటవెనుక ఈయాచార మేమిటే. కనఁబడినవాని నూరకపోనీయవు. నిలువవేసి మాట లాడెదవు. ఏమి ఆమాటలు. ఏమి యారహాస్యములు. ఏమి ఆనవ్వులు. ప్రొద్దున అన్నము తినిపోయి యింతదనుక నెందున్నదానవు ఎక్కనకడప యెక్కక యిళ్లల తిరుగు చున్నావు. ఇంతసేపెవ్వనియింట నుంటివో ఆతఁడేమి చుట్టమా పక్కమా. అంతవానితో నీకు మాటలేమే చూచి నవా రేమనుకొందురు. మొగమున నుమ్మివేయరా. చీపురు కట్టతోఁ గొట్టరా. నీమర్యాద మండినట్లే యున్నది. నీవిట్లున్న

నీపిల్ల లేమగుమరో తెలియునా? నీకంటె పలుగాకులై పోవు దురు. వారికొఱకనియైన తిన్నగా నుండరాదా. అని పద్మా వతిని అత్త గట్టిగా దబాయించెను.

అత్త తన్నుఁ బిలిచి పిలిచి యాక్షేపింపఁగా పద్మావతి గిరుక్కున తిరిగి మిఱుఁజూఱుం జూచుచు గాడిదకువచ్చినట్లు నీకు పండ్లువచ్చినవి. లాభమేమి? పెద్దముండలే పోనిమ్మసి యూరకుండినందుల కిది ప్రాయశ్చిత్తము నాకు పెట్టు చున్నావా! చెత్తముండా! నీకొడుకు ముల్లెయేమియుఁ బెట్టి పోలేదు. సకలశ్రమములుపడి దేహకష్టముచే గడించినధన ముతో బ్రదుకుచున్నాను. లేనియోపికఁ దెచ్చుకొని నలుగురి నాశ్రయించి శరీర మమ్ముకొని నాలుగుడబ్బులు గడించు కొని పిల్లలను గాపాడుకొనుచు నెట్లో నలుగురు నవ్వకుండ జీవించుచున్నాను. పోనీ పాపమని దండుగతిండి నీకును బెట్టు చుండగా నూరక తిని కూరుచుండక ఆక్షేపించుచున్నావా? తాంబూలము వేసికొనుట తప్పా. నీమగఁడుపోయినప్పుడు నీ విట్లే చేయలేదు కాఁబోలు. అందఱిసంగతి నేను విన్నానులే. నేనెవ్వరితో మాట్లాడిన నీకేమి? వారివారిసమయములను గనిపెట్టి వారియిష్టానుసారము మసలకపోయిన నా బ్రదు కెట్లుసాగును? నీవిచ్చిన వరాలమూట యున్నదికాఁబోలు. ఇంకనైన నోరుమూసికొని చచ్చినట్లుండుము. మిక్కిలి మాట లాడిన వీఁపు బ్రద్దలగును. పోపొమ్మని కసరివైచెను.

అంతలో నలుగు రమ్మలక్కలు చేరిరి. అత్త యేడుపు మొగముతో నుండెను. పద్మావతి తాంబూలరాగము పెద వులఁ గనఁబడఁ గోపమున మోము జేవురింపనుండెను. సంగతి

సందర్భముల నెఱింగి పద్మావతి నేమనక యామె అత్తను గసరివేయసాగిరి. పెద్దముండకు నీ కెందులకు నీ పెత్తనము. మర్యాదగా నలువురిలో పద్మావతియన్న చాలమంచిదని, శక్తియున్నంతవఱకుఁ దమకూట జవదాఁటక దేహముసంచి యుపకారము గలిగించిపోవునని యిచ్చిన నీయకున్నను బని కభ్యంతరము కలిగింపదని పేరు తెచ్చుకొనినది తా నాశ్ర యించిన నలువురకు సమయమునుగని పెట్టి వారిలో వారికి కోపముఁ కలుగకుండ దనపని సాగించుచుండును. ఇచ్చినవాని కిచ్చినట్లు, -ఈయనివాని కీయనట్లు మెలఁకువగా నెట్లో తన దేహమును కష్టపెట్టి యుపకారముచేసి యందఱకు నాలుక వలె తిరుగుచున్నది. వారుమాత్రము ద్మావతి పేదరాలని చిన్నచూపున చూతురా. తగినట్లే ధనమిచ్చుచున్నారు. కావున హాయిగా జీవయాత్ర సాగించుచున్నది. ఆయుసా యమే పద్మావతికి లేకపోయిన పిల్లవాని కాపట్టుపంచె లెక్కడ నుండివచ్చును. వానింజూచిన ధనవంతునికొడుకే యని తోఁచును. కూఁతురుమాత్రము సంపన్న కుటుంబమునకుఁ జేరిన దని యందఱు నమ్మునట్లుండును. ఇదంతయు నీకొడుకు పెట్టి పోయిన బంగారుమూటమూలమున సాగుచున్న దనుకొంటి వా. నిన్న గొన్న సరిగచీరకు నలువదిరూపాయలు నీవిచ్చితివా నీమగఁడిచ్చెనా? ఇంటివారి కెఱిఁగించియో రహస్యముగనో పురుషోత్తముదానే యిచ్చెను. ఇన్నియు చూచుచు నామె గణించితెచ్చినదానినే తినుచు పైఁగా నామె నాక్షేపించుట యెంతమర్యాదగా నున్నది? ఎవరిగతి వారిదనుకొని యూర కుండవలెఁగాని అది యిట్లు యట్లు అని యాక్షేపింప

రాదు. కాలానుసారము వర్తింపవలయునుగాని పెద్దలయాచార
మని కూయుచున్న లాభమేమి? పెండ్లియైన పోగునన్నపుడే
నాలుగుడబ్బులు ప్రోగుచేసికొనవలయును. అవల మొగము
చూచువా రెవరు? ఇపుడు మాయందఱి నెవరు మాట
లాడించుచున్నారు. పిలిచినఁగూడ పలుకరు. నీకోడలు పిలువ
నిష్ఠు. పనిమాని నిలిచి మాటలాడి సమాధానము చెప్పి అడిగి
సమ్మతించినదని తెలిసికొనిపోవుదురు. దీనికిఁ గారణమేమో
తెలియునా. ఆమె మంచితనమే కాని యింకొకటి కాదుకదా.
అట్టికోడలిని తిట్టుట యేమి బాగున్నది. నీకు కోడలిపనులు
సమ్మతములు కాకపోవచ్చును. అంతటి కష్టే యనుకొనరాదా.
ఒక్కనాఁడైన తలదువ్విన పాపమునఁబోయితివా. తలమాసినది
తలయంటుదును రమ్మని పిలిచితివా. అట్టి నీవు పసుపుపూసి
కొనునని వాసనగలనూనెతో తలదువ్వుకొనునని చీకటిపడిన
తర్వాత పూలుపెట్టుకొనునని గుమగుమలాడుతాంబూలము
వేసికొనునని యనుట కధికారివగుదువా. ముప్పదియేండ్లకు
నయిదాఱు తక్కువగనున్నవి. చిన్నతనముగదా. నలుగురు
తలదువ్వుకొనుచుండగా నుండలేక తాను దువ్వుకొనును.
తప్పేమి? తప్పుచేయనివారు వీరని వ్రేలుముడిచి చూపుము.
వారితప్పులు వేయి లెక్కపెట్టుదుము. ఎక్కడికి తప్పులు ఎక్క
డికి ఒప్పులు. ముక్కుకుసూటిగా పోవలెఁగాని యితరుల కను
కూలముగా వర్తింపరాదు. దాన మేలులేదు. ఇంకచాలు.
నోరుమూసికొనిపొమ్మని చీవాట్లుపెట్టిరి. ఆమె యేమియు నన
లేక తలవంచుకొని యింటికిఁబోయెను.

## మి టా రు ల నీ టు

ఇపుడు పద్మావతిపక్షమున మాటలాడినవారు పెద్దతః మున పతివ్రతలయినవారే. పద్మావతిని పల్లెత్తుమాట యన్న ప్రాతవి పైకివచ్చునని వారెఱుఁగుదురు. కనుక వారామెను పై వేసికొని మాటలాడి మైత్రికనఁబఱచిరి. అందొకతె పద్మావతికి బంధువనందగినది. పూర్ణాంబయని యామె నందఱు పిలుతురు. మఱొకముద్దుగుమ్మ పతివియోగమున నుల్లసిల్లుచు నిల్లిల్లుతిరుగు జానకిబాయి. వేఱొకలతాంగి కృష్ణాకుమారి. వివాహము మానియుండు తివ్రత ఇంక నొక్కయన్ను మిన్న పద్మావతికి బహిఃప్రాణ మనందగియుండు మంగళాంబ. తక్కినవారు సమయోచితపాతివ్రత్యముగలవారు. పద్మావతి యత్తరయో మంచియాచారముగలది. ఏఁబదియేండ్లకు మించిన వయస్సు గలది. యశోదమ్మ యని యామె నెల్లరుఁ బిలుతురు. భర్తయున్నప్పుడు నామె యిల్లుదాఁటి యెఱుఁగదు. ఇద్దఱు కొడుకులు కలుగఁగా పతి మృతినొందెను. బాలకులఁ బిలుచుకొని నగరమును జేరి వారికి చదువుచెప్పించెను. ధనవంతుల యిండ్లలో మంచినీరుపోసి వారిచ్చుదానితో బాలకులఁ బోషించుచుఁ బెద్దవారింజేసెను. పెద్దకుమారుఁడు గ్రామోద్యోగి యయ్యెను. రెండవకుమారుఁడు వైదికవృత్తి జీవించుచుండఁగా నతఁడు ధనమార్జింపఁగలఁడని పద్మావతి నిచ్చి వివాహముచేసిరి. పట్టుమని పదియేండ్లు సంసారముచేయు నదృష్టములేక యతఁడు మృతినొందెను. తొలిసంతానము కూఁతురు. రెండవసంతతి కుమారుఁడు. యశోదమ్మ పుత్త్రశోకమునఁ బొక్కియుఁ పిల్లలనుజూచి పెద్దకొడుకు కడకరుగ కాళ్లాడక పద్మావతికడ నుండెను. ఈకలహము జరగునప్పటికి

పద్మావతికుమారున కైదేండ్లు. వానికంటె రెండేండ్లు కుమారిక పెద్దది.

పద్మావతి వివాహ మతివిచిత్రము. నగరమున నొక యింట వివాహము సాగుచుండెను. ఆయింటిపురోహితుఁడే యశోదమ్మ రెండవకుమారుఁడు. పురోహితుఁడైనను ధనిక బాలకులకంటె నందఁగాఁడే యనవచ్చు. అతనియందమునకుఁ గళంకము పెద్దముక్కు. అది సమానముగానున్న నెంతయందమన్న ననవచ్చు. పద్మావతి యక్కయింటికడనుండి యా పెండ్లికి వచ్చెను. పురోహితునితట్టు చూచువారేకాని పెండ్లికొడుకును జూచువారె లేకుండిరి. పద్మావతి యక్కయు నాతనిం గాంచి చెల్లెలి నిచ్చిన మేలని తలంచెను. చెంతనున్న పెద్దముత్తైదువుల నడిగి యతఁడు బ్రహ్మచారి యని తెలిసికొనెను. ఇంటికింబోయి పతితోఁ జెప్పెను. అతని కింటిలో మాట జరగదు. భార్య చెప్పినట్లే చేయవలయును. అతఁడు నట్లే యని యొప్పుకొని చూచినపుడెల్ల అన్నయ్యా యని పిలుచుచు నేదో నెపమున నాతని నింటికిం బిలుచుచు నేవో పూజలు చేయింపుమని వేఁడుచు తాంబూలము లిచ్చుచు మెల్లగా స్నేహము చేసికొనియెను. ఆతనిగృహిణి బావగారూ అని పిలుచుచు నేదో ఫలాహారము పెట్టుచు లాలించెను. ఫలాహారము చేయఁగా పద్మావతీ యని పిలిచి తాంబూలము తెమ్మని యిప్పించుచుండెను. అప్పటికి పద్మావతి కెక్కువయేండ్లు లేవు. పదునాలుగేండ్లుమాత్రమే నిండియుండెను. కాని యీమోహనాంగి ప్రౌఢవలె నటించుచు నతనికిఁ దాంబూలమిచ్చుచుఁ బెదవిదాఁటని చిఱునవ్వున నేమో వికార మాతనిమదికిఁ

గల్పించుచుండెను. కపటమెఱుఁగని యాపురోహితుఁ డప్పటి నుండి యామె౦ బెండ్లాడఁగోరుచు నేదో యొక కారణమును గల్పించుకొని పలుమాఱు లాయింటికివచ్చుచు నన్న గారున్నారాయని యడుగుచునే లోనఁ బ్రవేశించుచు నతనిభార్య యపుడు లేకుండినఁ బద్మావతి కేమైన నిచ్చుచుఁ బోవుచుండు వాఁడు. కొలఁదికాల మీయుల వాటున సాగఁగా నాతఁడాపద్మావతిబావతో వివాహమాడ నెందఱో తన్ను బల వంత పెట్టుచున్నట్లు తాను దగినసంబంధము దొరకినఁగాని సమ్మ తింపనని చెప్పినట్లు చెప్పసాగెను ఆతఁడు విని విని నామఱఁదలు పద్మావతిని మీ రెఱుఁగుదురుకదా. వివాహాయుక్త వయస్సుగలదియే. అందఱు పదునాలుగేండ్లందురు. కాని పదు మూఁడవయేఁడు వచ్చినది. వారి యింటియలవాటు ననుసరించి రెండుమూఁడు నెలలకుఁ బుష్పవతి యగును. నేనును దగిన వరుఁడు దొరకక తిరుగుచున్నాఁడను. దాని పెండ్లిబరువు నా తలపైఁ బడినది. ఇద్దఱు ముగ్గు రడిగినారు కాని పిల్లసమ్మతించ నందున మాట చెప్పలేదు. రెండుమూఁడుదినములలో నేదో చెప్పకతప్పదు. మీరు సమ్మతించిన నేనెట్లో పిల్లను సమ్మతింపఁ జేసి వివాహము చేయుదునని యుక్తిగా మాటలాడెను. కుమారస్వామి యనుపేరుగల యాపురోహితుఁడు రొట్టె విఱిగి నేతిలోఁబడినదని తథాస్తు అనెను. పిదపఁ బద్మావతి నడుగఁగా నామాటల కాయన సమ్మతించినఁ బెండ్లియాడుదు ననియె.

మఱుదినము కుమారస్వామి మరల రాఁగా నాతని కామాటలు తెలిపి మఱఁదలితో మాటలాడఁబంపెను. పసమటి

భాగమునఁగల చెట్లపొదకడ నాహ మాట్లాడున ట్లనసెను. పద్మావతీ నన్నుఁ బెండ్లియాడుకొవా యని కుమారస్వామి యడిగెను. నవ్వుచు నాకు నీవు తెచ్చిన ధనమంతయు నిచ్చుచు మరల నడుగకుండినఁ బెండ్లియాడుదునని మూతిత్రిప్పెను. కృతార్థుఁడనైతినని తలంచుకొనుచు నట్లే యిచ్చెదను. అని ప్రమాణము చేసెను. ఇతర గ్రామమున నొక దేవాలయముకడ వివాహము జరగెను. అది మొదలామె దే పెత్తనము. అత్త దాసివలె నుండెను.

పద్మావతి సొగసుకత్తె యని పెక్కండ్రు తలంతురు. ఇంచుక నిచ్చో వ్రాయక తప్పకపోయెను. మొగము పొడవు గాక పొట్టియు గాక సమానముగానుండును. గడ్డము సొంపుగ నుండు. చెక్కిళ్లు మరియాద గాంచఁజాలినవి. చెవులు పెద్దవియే. కన్నులు పెద్దవియైనను బెట్టుకొన సునువుగా నుండును. నొసలు మిట్టగనున్నను జూడ ననువుగనేయుండును. గుంతకన్నులు మాత్ర మామెముఖసౌందర్యమును దగ్గించినవని యంద అంగీకరింతురు. చేతులు పొడవులు. లతాకోమలము లే. నడుమంతసన్నము కాదు కాని వికారముగనుండదు. పాదములు తగినట్లే యుండును. నడక మందయాన యనిపించును. కంఠనాదము కోయిలతల్లివంటిది. మాటలచమత్కృతి మెండు. ఎదుటివానిని గనిపెట్టి మాటలాడు నేర్పు మెండు. బాసలు చేయుటలో నూతనసృష్టి యనవలయు. మనస్సు గరగించునట్లు మాటలాడుశక్తి ఉగ్గుతో పెట్టినట్లుండును. వాగ్దానములకు హద్దులేదు. దానికిందగిన ఫలముమాత్రము శూన్య మనవచ్చును. అన్నియు నొకయెత్తు. అగస్త్యుఁ డొకయెత్తుఅన్నట్లు

సమయోచితముగా మాటలాడు నేర్పునకుఁ దోడుగా కటాక్ష వీక్షణములు ఆమెకు జనవశ్యము చేయుచుండును. ముఖస్తుతులకు పుట్టినయిల్లు. కనఁబడనిచో దూషణముల కిల్లే యనవలయు. తిండి మెండు. దుంపకూరలు తిని జీర్ణింపఁజేసికొనుటలో భీమున కీమె జ్యేష్ఠసోదరియే యనవలసినదే. విలువగల చీరగట్టుకొని క్రొత్తపద్ధతిగా కుట్టబడియున్న రవికతొడుగుకొని మేనో యొకటిరెం డాభరణములు పెట్టుకొని పూవులు జడలో ముడుచుకొని వీథివెంటఁబోవుచుండఁగా చూచువారానందింపక పోరనుట సర్వసమ్మతమగు మాట. కావుననే కార్యాంతరమునవచ్చినయొక మహాకవి పద్మావతిని మిటారియని పొగడెనఁట. మఱొకపండితకవి ముద్దుగుమ్మయని నుతించెనఁట. ఇంక నొకరసికశిఖామణి యన్నులమిన్నయని సన్నుతించెనఁట. ఒకయున్నతోద్యోగి సౌభాగ్యవతి యని వర్ణించెనఁట. ఇంకొక పండితుఁడు భగవతి యని ప్రార్థించెనఁట. ఒక్కశృంగారకవి మోహనాంగి యని ప్రశంసించెనఁట. మఱియు నొకకవిశేఖరుఁడు మాయలాడియని మన్నించెనఁట. ఇట్టు లిందఱు స్తుతింప నేదో యొక యపూర్వరమణీయత లేకయున్న నెట్లు సంభవించును? పద్మావతి మొత్తముమీఁద నందగత్తెయే యనవలయును.

# రెండవకళ.

కుమారస్వామి భార్యతో నగరముచేరుట.

పద్మావతి సఖియలఁ గూర్చుకొనుట.

పురుషోత్తమదాసు పతివ్రతలపరిచయమునకు బ్రయత్నించుట.

పెండ్లి కాఁగానే కుమారస్వామి పల్లియలలో నింకనున్న భార్యకాపురము చేయదని యూహించి యొకనగరముఁ జేరెను. ఆతఁడు వేదము చదువుకొన్నవాఁడు. జననమరణములు వాని నడుమగల కర్మములఁ జక్కఁ జేయింపగలవాఁడు. అల్పసంతోషి. స్నేహపాత్రుఁడు. మంచివాఁడనిపించుకొనెను. నలుగురను ఆశ్రయించి వారిచ్చినతృణమును మేరు వనుకొనుచు వారి యింటిస్త్రీలకడ మర్యాదతో వర్తించుచు యోగ్యుఁ డనిపించు కొనియెను. నగరము చేరునప్పటి కాతనికడ మూఁడుపంచెలు మాత్ర ముండెను. అందు బంధువులు సంపన్నులొకరుండఁగా వారియింటఁ జేరి వారిసాయమున నలుగుర నెఱింగి వారి కాశ్రితుఁడయ్యెను. తల్లి యశోదమ్మ యతనికడ నుండెను. భార్యయిల్లుచేరినదనుక నెట్లో తల్లియుండుట కంగీకరించెను. కాని తల్లియందుఁ భక్తిగలవాఁడుమాత్రము కాఁడు. అపుడపు డామెను జీవాట్లచే గౌరవించువాఁడుగ నుండెను. కాని యాసాధ్విమాత్రమురవంతయైనకోపమునొందక మహాప్రీతితో తండ్రిలేనివాఁడని బీదవాఁడని తలంచి యేమన్నను భరించుచు

కాలము ద్రోయుచుండెను. పురోహితత్వము పాఁడియావువంటి దని లోకులందురు. అది నిజమే. ప్రతిదిన మేదో యొకపదార్థము దొరకుచునే యుండును. కాన సుఖముగా కాలము దాన పుచ్చవచ్చును. మంచివారికి లాభము తక్కువ యనుట క్రొత్తది కాదు. కుమారస్వామి పీడించువాఁడు కాఁడు. కాన నందఱి కంటెఁ దక్కువగనే యతనికి దొరకుచుండెను. గృహస్థులకడ మర్యాద హెచ్చుగా నుండెను. అదియే పదివేలనుకొనుచు నతఁ డానందించుచుండెను. కొలఁది నెలలకుఁ బద్మావతి పుష్పవతియయ్యెనని యందఱకుఁ దెలిసెను. చాలదినములు జరగి యయ్యెనని కొందఱును, ఎప్పుడో యైయుండునని కొందఱును, పెండ్లికిముందే మంచినక్షత్రమున పుష్పవతి కాఁగా దాఁచిపెట్టిరని కొందఱు ననుకొనసాగిరి. లోకులు కాకులు నొకటి యనుసామెత కిది యుదాహరణము కదా. నిజము నిలుకడమీఁదఁ దెలియఁగలదు. పెండ్లి సంవత్సరమున కగు ననఁగా నాపద్మావతి యక్కగారింటనుండ నదియే కారణ మనియు, ఆమెమగనికిఁ బద్మావతిపై ప్రీతి మెండనియు పెక్కుమంది చెప్పుకొనసాగిరి. బావ అక్క సమానప్రవృత్తి గలవారలే కాన పద్మావతి నట్లే చేయుదురని కొందఱూహింప సాగిరి.

కుమారస్వామి భార్యను బంపవలయుననియు నింటఁ దల్లి వంటచేయఁజాలదనియు పూటపూటకు భోజనమే కష్టముగా దొరకుచున్నదనియు మామగారికి వ్రాయుచుండెను. ఆమామ పెద్దయల్లునకు వ్రాయుచుండెను ఇపుడేమి తొందఱ, పెండ్లికాలేదనుకొనఁగూడదా యని యాయల్లుఁడు పలుకుచు

మామకు కళ్లే వ్రాయుచుండెను ఆసంగతి తెలుపక మామ చిన్న యల్లుఁడగు కుమారస్వామి కేవల నాలుగుమాటలు వ్రాయు చుండెను. పద్మావతి పెండ్లి యొకయుద్యోగమం దుండెను. ఆ తావునుండి వేఱొకతావునకు నతని [illegible] పంపిరి. భార్యమఱదలు కూడలేకుండఁగా నతఁ డచ్చోటికి కదిలెను. అది మొదలు కుమారస్వామి కనుమానము పొడసూపఁ జొచ్చెను. అతఁడు మామకు వ్రాసినమాట లెట్లో యతని చెవులఁ బడియుండును. అంతకుముందున్న స్నేహము మాసిపోఁగా నాతనిదూషింప మొదలిడెను. కాని యాతఁడెందు కనఁబడినపుడు సాకినకుక్కవలె నుండువాఁడు. ఇట్లుండకున్న నామెను బంపక మొదటికే మోసము తెచ్చునేమో యని యాతనితలంపు. ఉపాయమున నామెను బిలుచుకొనివచ్చి పిదప బిగించుకొని యుందమని యతనిభావము. తా నా గ్రామమునకుఁ బోయి యతఁ డింట లేనితఱి భార్యయగు పద్మావతితో మాటలాడుచు నాతో రమ్ము అని పిలువఁగా నామె మాబావ నడుగవలయు నని బదులు చెప్పుచుండెను. ఇంక గట్టిగానడిగిన పోపొమ్మను నేమో యని నోరుమూసికొని గుటకలు మ్రింగుచు మరలి వచ్చువాఁడు. ఇట్లు కొన్ని నెలలు గడచెను. కనఁబడినవారెల్ల కుమారస్వామితో నీభార్య నింక నేల యుంచుంచితివయ్యా యని కొంతకాలము, లోకజ్ఞానము లేదా యని కొంతకాలము అనసాగిరి. మదినున్న యనుమానము రెండింతలు కాఁగా మిత్రులతో నాలోచింపసాగెను. వారు చెప్పినప్రకార ముద్యోగుల నాశ్రయించి యతనికిం జెప్పించి యెట్లో నిషేకముహూర్తము జరపింపకయే పిలుచుకొనిరాఁగల్గెను. ఆమె అక్కడయే.

పిలుచుకొనివచ్చి చెప్పఁదగినయానాలుగుమాటలు చెప్పి పతికడ కరిగెను. అక్క చెప్పినమాటలను జవదాఁటనని తలంచుకొనుచుఁ బద్మావతి పతియింట నుండెను. నలుగురు చేరి కుమారస్వామిగా రెప్పుడు నిషేకముహూర్తము జరపింతురనఁగా నది మాయింట అచ్చుబాటుగా లేదని బదులుచెప్పెను.

కుమారస్వామి యుండునింట మఱికొందఱు కాపురముండిరి. అందొక జ్యోతిష్కుఁడు కలఁడు. కాశ్యాదిదేశములలో చదువుకొనివచ్చినాఁడని యందఱు అతని గౌరవించుచుండిరిగాని 'ఎక్కడనున్నావుగొంగళీ వేసినచోటనున్నాను మంగలీ' అన్నట్లు వ్యాపించువాఁడు కాఁడు. కాన నతనివిద్య ప్రకాశింపకయుండెను. అతనియం దించుకభక్తి కుమారస్వామికుండెను. సుముహూర్తమడిగి యది యితరులకుఁ దెలియకయుండ సాగింపవలయునని యతఁడు తలంచెను. కాని యది పద్మావతియెఱింగి విలువగలచీరలు కావలయుననియు సువర్ణహార మొకటి చేయింపక తప్పదనియుఁ గోరెను. కుమారస్వామి వెదకి విఱిచెను. పద్మావతి మూతిత్రిప్పెను. తుదకు నామెపద్దే గెలిచెను. పలుమాఱు లామె పతివినునట్లుగా నత్తగారితో నాయిష్టప్రకారముగ నుండకన్న బావకడనే యుందును నాయక్కకంటె నన్నెక్కుడు ప్రేమమున నాదరించువాఁడు. కాన నా కందేకొఱఁతలు నుండవు. అని చెప్పుచుండెను. మొదటనే యనుమానపడినకుమారస్వామి యామె మాటలు విని మఱింత యనుమానపడి భార్య చెప్పినట్లు వినకున్న సంసారము చెడునని తలంచి దేవుఁడా యని సువర్ణహారము అమూల్యవస్త్రములు తెచ్చి యవ్వాని కామె తృప్తిపడు

నట్లు మాటతీసికొని సందేహము వదలెను. కొలదిదినము లా యింపుర సంతోషముగ కాలముగడిపిరి. అనసూయనే తల్లిని సుకుమారస్వామి సాగనంపెను ఆమె పెద్దకొడుకుకడ నుండెను.

# మూఁడవకళ.

పురుషోత్తమదాసు నగరమున నుద్యోగిగనుండుట.

పద్మావతి జానకీతోఁ జెలిమిచేయఁబూనుట.

పురుషోత్తమదాసు పాంచాల దేశస్థుఁడు. రాజవిద్య చక్కఁగా నేర్చినవాఁడు. మఱికొన్ని భాషలు వచ్చినట్లే నటించువాఁడు. మంచివాఁడనిపించుకొన యత్నించువాఁడు. గౌడ బ్రాహ్మణుఁడు, మత్స్యభక్షకుఁడైనను దానిమానినట్లుండువాఁడు. అందగాఁడని కొందఱమతము. ముఖమునకంటె పెద్ద విగ మీసాలుండును. వికారరూపుఁడు కాడనవచ్చును. నలువురను జేరదీసి మంచిమాటలఁ గాలము గడుపుచు నేపనియు తనమూలమున వారికి ఫలింపకయుండ చూచుకొనుచుండువాఁడు. మాటలంబట్టి వానిమూలమున నందఱు నతనికడ జేరుచు మాటలాడుచుఁ బోవుచుండువారు. రాజనీతిని మిగుల నెఱింగినవాఁడని యతనికిఁ బేరువచ్చెను. కాని యద్దాని నుపయోగించి తనశక్తిని జూపదగినచోటు ఆయనకు దొరకలేదు. ఎందఱో చెప్పఁగా దివాణమునందు రాజపుత్త్రులకు చదువు

నేర్పు నుద్యోగము దొరకినది. పెద్దయుద్యోగముచేయ నుబ్బి తబ్బిబ్బులగుచుండు నాపురుషోత్తమదాసునకుఁ దుద కది దొరకుట యదృష్టమనవలసివచ్చెను. "అతి సర్వత్ర వర్జయేత్" అని పెద్దలందురు. దొరకినదానితో తృప్తిపడుచుఁ బ్రయత్నము చేయుచున్న నంతకుమించినది అదృష్టమున్నయెడల దొరకును. ఉన్నదానిని బోఁగొట్టుకొనరాదు ఈనీతి ననుసరించి యాయుద్యోగమున కంగీకరించెను. రాజపుత్త్రుల దయయున్న నెంత లాభమైనఁ గలుగవచ్చునన్న గంపెడాసతో నాయుద్యోగమునకుఁ దృప్తిచెందెను. దేహశ్రమము తక్కువగనే యుండెను. రాజపుత్త్రకులు చక్కగా మాటలాడుచున్న వినుచుండువారు. చదువుచెప్ప నారంభించిన విసుగుకొనుచుండెడివారు. కనుక వారికిఁదగినట్లు సల్లాపములు సాగించుచు నడుమ నడుమ నాలుగుముక్కలు చెప్పుచు వారికి విసుగు తోఁచకయుండఁ జేయుచుండెను. బోధించుటయం దత్యంత నిపుణుఁడని యావలకే పేరువచ్చియుండెను.

దేహమునకుఁ దగినపని కల్పింపకపోయిన సోమరితనము వచ్చునని పెద్దలుచెప్పుచుందురు. పురుషోత్తమదాసు శ్రమించి బోధింపఁదగినంత యవసరము లేకపోయెను. చల్లనిగాలి మంచి మేడ. పట్టుపఱుపులపైఁ గూరుచుండుట యీమాట ఆమాట చెప్పుచుండుట నడుమనడుమ విశ్రాంతి ఇవియన్నియు నతనికి సోమరితనమును గల్పింపఁజాలినవయ్యెను. అది రాఁగానే ఇంచుక మత్తువస్తువులు వాడుట యారంభమయ్యెను. కొలది దినములు గోప్యముగా నుండెను. రాత్రివేళ పురుషోత్తమదాసుకన్ను లెఱ్ఱగా నుండునే ఏల? అని కొందఱును పగలు

మాటలాడినట్లు రాత్రివేళ మాటలాడఁజాలకున్నాఁడే ఏల? అని కొందఱును ప్రశ్నింప సాగిరి. మఱి కొంతకాలమునకు దాసుగారు శాక్తులని వెల్లడియయ్యెను. మునుపున్న మర్యాద ఇంచుక తగ్గసాగెను. దురభ్యాసముల కేకాలమునందైన గౌరవము గల్గునా? మధుపానము ధనమును బోఁగొట్టి అంతతో నూరకొనదు. ప్రాణాపాయమును గూడఁ గల్పించును.

ఆమీఁద నాదాసుతోఁ బెద్దలు స్నేహింపక యుండిరి. కాని మొగముముం దెవ్వరుగాని యడుగ సాహసింపకుండిరి. ఎంత యడుగలేకపోయినను సంభాషణము మర్యాదగా నుండక సాధారణముగా నుండెను. అది దాసునకు మనోగోచరమైనను సహించియుండెను దాసునకు దృష్టియం దొకదోషము కలదు. మంచిపదార్థమును జూచిన నది తనకున్న బాగుండుననునూహయే యాదోషము. కొంతకాల మది స్వభావమును కొనుచు నుండెడివారు. క్రమక్రమముగా దూతికల నంపుటవఱకు నది యల్లుకొనెను. ఈగుణము కూడ నీతనికున్న దాయని మర్యాదగలవా రనుకొన సాగిరి. తెలివితక్కువవారద్దాని నాలోచింపకయే యుండిరి. దాసుకడ నొకపరిచారిక యుండెను. ఆమె యంబష్ఠకులమునకుఁ జేరినదని యాపె పుట్టువు నెఱింగినవారందురు. వేఱొకకులమువాని వరించి సంతానముం గని యతఁ డెందులకో విడువఁగా వయసు మరలినపుడు దాసుగారింట పరిచారికఁగా నుండఁ గుదిరెను. రూపవతియే యని ముందనువార లిపుడు ఆమాట మానిరి. మర్యాదగా మాటలాడనేర్పు చేయిదుడుకులేకుండ వర్తింప నేర్పు తోఁచినంత యుపకారము కూడఁ జేయుచుండిన నాపరి

చారిక నెవ్వారైన స్వీకరింతు రనవలయుఁగదా. విశ్వాసపాత్ర
మగువస్తువు దొరకుట దుర్లభమందురు. పురుషులకడ పురుషుల
మాటలు స్త్రీలకడ స్త్రీలమాటలు పల్కుచు నందఱికడ మంచి
పేరు సంపాదించుకొని విశేషించి దాసున కుపచరించుచుం
డెను. దాసుగారియింటివారు పెక్కండ్రుండి క్రమముగా
నశింపసాగిరి కొంద ఱందు గ్రామాంతరముల నుండఁబోయిరి.
సంసారము పెద్దది. సంపాదించువా రొక్కరు. వారికిని రాత్రి
ఖర్చు మెండు. కావున నెవరిగతి వారు చూచుకొనుట మంచి
దని వారి నాశ్రయించియుండు బంధువు లందఱుఁ జని
యేదో యుద్యోగమో వ్యాపారమో కుదుర్చుకొని జీవించు
చుండిరి. దాసుగారికిఁ బుత్రసంతానము లేదు. పుత్రికాద్వయ
ముండెను. ఒకతుక గొడ్రాలు. వేఱొకతుకకు నిద్దఱుకుమా
రులు. ఆమెపతి యించుక యవివేకుఁడు. దాసుబంధు వొకఁడు
పుత్రికావాత్సల్యమున నామెం గొనిపోయి తనయొద్ద నుంచు
కొని పోషించుచుండెను. తల్లి లేక యొంటిగానున్న తండ్రికడ
నుండుటకంటె నాఁడుతోడుగల పినతండ్రియింట నుండుట
మేలని యామె తలంచి యతనికడకుఁ బోయి యాపిల్లలను
గని పెట్టుకొనియుండెను. తండ్రికి వేలువిడిచినతమ్ముఁడే యామె
యున్నయింటియధిపతి. సాధ్వి యనిపించుకొని తండ్రికుశలముఁ
కనుఁగొనుచు నపుడపుడు పిలిపించుకొని తండ్రిం జూచుచు
నెట్లో కాలముం ద్రోయుచుండెను. దాసు వచ్చుధనమును
గూర్పఁజాలక వ్యయముచేయుచు నెమ్మదినుండెను. దాసు
నింట నిపుడున్నది యాంపరిచారిక యొక్కతయే. నోట నాలుక

వలె నాదాసున కామె సాయపడుచుండెను. పెద్దకూఁతురు దేశాంతరమున నున్న పతికడ నుండెను.

ఒంటరిగానున్నవారికి మంచియో చెడునడవడియో పట్టుపడునని కొందఱందురు. దానిని దాసువర్తనము దృఢపఱుపఁజాలెను. ఇంతకు మధుపాన మలవడెనని ముందే వ్రాయఁబడియెఁగదా. పని చాలినంత లేక మంచియాహారము కడుపునఁ బడుచున్నపు డింద్రియము లూరకుండవు కదా. బాలకులకు తుంటరితనము నేర్పు పాఠశాలలుండవు. అది తనంతనే యలవడును. దాని మానునట్లు చేయుటకే విద్యాశాల లుండును. ఇంద్రియములు కూడ బాలకులవంటివి. చపలత్వము వానికి నైజము. దాని మాన్పించుటకే యోగశాస్త్ర మంతయుఁ గనిపెట్టియుండును. అవి సామాన్యప్రయత్నమున లొంగవు. విశేషప్రయత్నము చేయవలసియుండును. ఆహార నియమము దానికి ముఖ్యము మంచిపుష్టినిగల్గించు నాహారముం గొనుచు దానికిఁ దోడుగా మధుపానము చేయుచుండువారి కప్పని శక్యమే కాదని కొందఱందురు. పురుషోత్తమదాసు మాటలపుట్టయని ముందే చదివియుందురు. ఏకాంతవాసము, పెద్దమేడ, వలసినపని చక్కఁజేయఁగల పరిచారిక, చేతినిండ ధనము, సంసారవ్యయము లేకుండుట యను నీకారణము లన్నియు నింద్రియముల లోఁబడకయుండఁ జేయఁగలసాధనములు. ఈపరికరములు కుదిరియున్నందున నాదాసు కాంతాదాసుఁడయ్యెను. అత్యంతరహస్యముగా నాపరిచారిక దూతికయై దానిపని చేయసాగెను.

పురుషోత్తముదాసునకు మిత్రుఁ డొకఁడు గలఁడు. భుజంగద్వివేది యనిపేరు. ద్వివేది యింటిపేరు. ఆదేశవాసులకు నింటిపేరు చివరయందుండుట వాడుక. దాసునకు ద్వివేదికి నెక్కువమైత్రి కుదిరెను. ద్వివేది రాజవిద్య యించుక నేర్చుకొనియెను. ఆదేశమున రాజోద్యోగమునకు నలయుపరీక్షలో నెట్లో గట్టెక్కెను. ఉద్యోగము దొరకనందున దాసు తనదగ్గర నుంచుకొని రాజకుమారులకుం దెల్పి యెట్లో యొప్పించి నలువది రూప్యములజీతము ముట్టునట్లు చేసెను. ఆపరిచయమున ద్వివేదియింటివారుగూడ దాసుపై నెనరుంచిరి పండుగులందు దాసుగారిని బిలుచుచు భోజనము పెట్టి పంపుచువచ్చిరి. దాసు వారిపై నత్యంతభక్తిశ్రద్ధ లునిచియుండెను. కొలఁదికాలమునకు ద్వివేది తనపేరు సార్థకమగునట్లు వర్తింపసాగెను. ఆవీథివారందఱు ద్వివేదిబంధువులే కాన దాసుగారిమహత్త్వమును వర్ణించుచుండెను. కొందఱంగన లాస్తుతిని నమ్మిరి. కొందఱు చప్పరించిరి. కొలఁదిదినము లిట్లు సాగుచుండెను. దాసు మనోరథము సఫలము కాలేదు. కాని సఫలము గాకపో దనునాశ మాత్ర మతనికుండెను.

ఆనగరమున నొకద్విజాతి కుటుంబము గలదు. ఏదో యొకవ్యాపారమున జీవించుచుండ నలవాటుపడెను. బిచ్చమెత్తక జీవించుటయే మంచిదని యాకుటుంబమువారు తలంచిరి. దేహశ్రమమున బ్రదుకుట యెంతయు మంచిదనుట సర్వసమ్మతము గదా. సోమరిపోతులై యితరులను బీడించుచు బ్రదుకుట మంచిది కాదని యేకాలముననైన తలంచువారుందురు. స్వతంత్రముగా జీవించుట దేశమునకే మహోపకార

మగును. ఆసిద్ధాంతమును నమ్మి యాద్విజాతికుటుంబమువారు కాలముపుచ్చుచుండిరి. గర్వింపక ఉన్నదానితోఁ గాలము త్రోయుట యాకుటుంబమునకు స్వభావమని యెంచ తెలుంగఁ జాలిరి దానిచే వారిని మర్యాదగా నెల్లరును జూచుచుండిరి. ఆయింటివారిలో నొకరికొమార్తెయే జానకీబాయి. ఏకపుత్రిక యగుట తల్లిదండ్రులు గారాబముగాఁ బెంచుచుండిరి పది యేండ్లు నిండకముందే వివాహముచేయునూహ కలిగెను. ఆకాలమునఁ దల్లిదండ్రులకే తగినవరుని వెదకి యిచ్చుచుండుట వాడుక. బంధువులు త్వరపడనేల యని హితము చెప్పిరి. కాని బొమ్మలపెండ్లివలెఁ బెండ్లిచేసి మేము యానందింపవలయునని మాకోరిక యని బదులిచ్చిరి. దానికి బదులు చెప్పక యట్లే కానిమ్మనిరి. తల్లిదండ్రులముచ్చటలు తీరుటయే వివాహఫలమని వారియభిప్రాయము కాఁబోలు.

జానకీబాయికిఁ దగినమగని వెదకుటకు బంధువులు కూడఁ బ్రారంభించిరి. ఏకాక్యమైన నొక్కరుచేసిన నెఱవేఱును గాని పదిమందికలిసిన నది త్వరగా ఫలింపదు. కొందఱు వరునిసౌందర్యము, కొంద ఱతనిభాగ్యము, కొందఱు కులమర్యాద, కొందఱు వానివర్తనము పరిశీలింపసాగిరి. ఈపని ఫలించునా యని కొందఱు సందేహించిరి. ఇన్నివిధముల మెచ్చఁదగినవాఁడు దొరకునా యని తండ్రి సందేహించెను. ఒకరు మెచ్చినవాని నింకొకరు మెచ్చక తుదకు వరుఁడే దొరకలేదని చెప్పిరి. తండ్రి వారి నమ్మక యందందు తానే విచారింపసాగెను.

ఒకనాఁడు తల్లి జానకీబాయిం బిలిచి చెంత కూరు చుండఁబెట్టుకొని యిట్లు ప్రశ్నించెను.

ప్రశ్న — అమ్మా! నీమనస్సులో మనవారు మాట్లాడివచ్చిన వారిలో నీకెవఁ డిష్టపడును? దాఁపక తెలుపుము. ఇది వేయేండ్లపైరు సుమీ! తరువాత విచారించిన లాభము లేదు. బ్రదికినంతదనుక నాతనితోడనే సుఖదుఃఖముల ననుభవింపవలసియుండును. నీవు చిన్నపిల్లవు కావు కదా. పదియవసంవత్సరము వచ్చినట్లే. చక్కఁగా వ్రాయను చదువను నేర్చుకొంటివి. వయస్సునకు మించినవిద్య వచ్చినదని యెల్లవారు సంతోషించుచున్నారు. దృష్టిదోషము తగులునో కదా యని భయపడుచున్నాను. బొమ్మలువ్రాయుట నీకు చక్కఁగా నలవాటైనది. రంగులతో నీవు వ్రాయఁగా చూచి పెద్దమనుష్యులు సంతోషించిరి. నీకానాఁడు బహుమానము కూడ నిచ్చిరి గదా. చక్కఁగా పాడఁగలవు. కోయిలకంఠము నీకుఁగలదని యెందఱో నాకుం దెల్పిరి. మాపిల్లకేదియు రాదంటిని. నీచదువునకు పాటకు మెచ్చుకొనుట యటుండఁగా చక్కఁదనమున కుబ్బిపోవుచున్నారు. ఇట్టి నీకు నేచెప్పవలసిన దేమున్నది? తల్లినిగాన అడుగుచున్నాను. నీమనస్సులో మాటదెల్పుము.

ఉత్త. — ఇపుడు నీవు చెప్పినవారు నాకు సరిపడరు. వీరిలో నెవరికిచ్చినను నాయదృష్టమింతే అనుకొని యూరకుందును. అత్తవారింటికి నేనుబోయి సంసారముచేయను. ఇది నిజము. ఆమీఁద మీయిష్టము.

ప్ర. — పోనీ. మఱెవరిని గోరుదువు ?

ఉ.—సీతారామయ్యవేదిపై నాకిష్టము గలదు. అతనికిచ్చి వివాహము చేసిన నాకు సంతోషము గలుగును.

ప్ర.—జానకీ! ఈపూట అన్నమునకు గతిలేనివానిని గోరితివే ఏల?

ఉ.—అమ్మా! నాన్నగారు నా కీశ్లోకము వ్రాసియిచ్చినారు కదా!

"కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా వయః,
బాంధవాః కులమిచ్ఛంతి మిష్టాన్నమితరే జనాః."

అని. నా కన్నులకు నతఁడు సంతోషము కలిగించుచున్నాఁడు. ఈడుజోడు బాగుండును. నా అభి[illegible].

ప్ర.—చిన్నతల్లి! మనము నలుగురము పోయిన నాపూట భోజనము పెట్టలేనివాని నెట్లు పెండ్లాడెదవు?

ఉ.—అమ్మా! కలిమిలేములు శాశ్వతములు కావు. మొన్న లక్షాధికారిగా నున్నవాఁ డిపుడు భిక్షాధికారిగా నుండుట మనము చూడలేదా? నాయదృష్టము బాగుండిన ధనము రాఁగూడదా? మీరు వచ్చినపుడు పంచపక్వాన్నములతో నేనే విందు చేయఁగూడదా? మీ రపుడు మా అమ్మాయి యదృష్టవంతురా లనఁగూడదా? ఎవరు కన్నారు భాగ్యమును? భాగ్యము స్థిరమని నమ్మి సుగుణసంపద నెవ్వరు పోఁగొట్టుకొందురో వా రవివేకు లగుదురు. నేను గోరినది సుగుణములంబట్టియే. మీరు చెప్పినవారు ధనవంతులైనను నాకు వలదు. ఇది నాయభిప్రాయము. అని కుమారిత స్పష్టముగాఁ జెప్పఁగా నాలకించి పతియత్నము వ్యర్థమనియు, కొమరిత యంగీకరింపకున్న నావివాహము

సుఖము నీఁజాలదనియుఁ దలపోసి పతితోఁ దెలుప వేచి యుండెను.

ఒకనాఁడు జానకీబాయితండ్రి యొంటరిగా నుండి యేమో చింతించుచుండెను. భార్య పతికడ కేగి నిలువఁబడి యెను. ఈకుమారికకొఱకు పడరానిపాట్లు పడుచున్నాను. కుల గుణరూపశీలములుగలవారికి భోజనమునకుఁ గూడ ధనము లేదు. ధనవంతునికుమారునకుఁ బైనాలుగు లేవు. కులమనఁగా మంచివేసమోసినదని నాయభిప్రాయము. ఏమిచేయుటకుఁ దోఁపకున్నది. నీవేమందువు? అని భార్య నడిగెను. ఆమె కడు సాధ్వి. భయపడుస్వభావముగలది. కావున మాటలు తడఁబడుచుండ అమ్మాయియభిప్రాయమును వెల్లడించెను. ఆ మాటలు వినఁగానే మండిపడి యాయింటివారిపై రిత్తవలదని గద్దించెను. ఆమె వడఁకుచు నూరకుండెను. నేనేదో యొక చోటు నిశ్చయించుకొన్నాను. వివాహము చేయుదము. అని ఆమెను సాగనంపి కొమరితం బిలిచి బుజ్జగించి సీతల్లి నీమాటలు తెలిపినది. కాని యాచోటు మంచిది కాదు బుద్ధి మంతుఁడే కాని ఆయుర్దాయము తక్కువయఁట. గొప్ప సిద్ధాంతులే తెల్పినారు. కావున నీవట్టిమాటలు తలంపకుము. ఒక్క పిల్లవు కదా నీవు మాకు మాప్రాణములు నీయందే యుండును. నీమేలు గోరకుందుమా కన్నతల్లీ. నెమ్మది నుండుము. మంచి చోటు చూచితిని. అని సమాధానము చెప్పి పంపివైచెను. ఇంటి పురోహితుని పిలువనంపెను. ఆతఁడును అట్టహాసముగా దయచేసెను.

ఆనగరమున నతఁడే పెద్దపురోహితుఁడు. ఎవ్వరుతే నేటి యజ్ఞము చేయింపఁగలఁడు. వేదమంత్రము గొప్పది. నారాయణభట్టుని పిలుతురు. చదువేమిచ్చునో యెవరెఱుఁగరుకాని వారిదౌర్భాగ్యత యందఱెఱుఁగుదురు. ఉదయమే స్నానము చేసి సంధ్య వార్చుకున్నను విభూతిమాత్రము దండిగా వ్రాసి రుద్రాక్షలతావళులు వ్రేలాడుచుండఁగా రహస్యముగా శీతగ్రాసము నాలుగుకబళములు మ్రింగి మజ్జిగ త్రాగి సూర్యోదయమునకు వెలుపల వచ్చును. ప్రాశస్త్యతయని ఆయనకుఁ జేయ గలదు. ఏదో పదపడు బడుతుకి కాఁగా నేఁడు శ్రాద్ధమనియు నిమంత్రణమునను జరుగున్నఁగాని తృప్తిలేదనియు నెవరో చెప్పుదురు. ఒక్కరూపాయి దక్షిణయిచ్చువాఁడైన నోహో తద్దినము తద్దినమూ కానిండు. తప్పక వత్తు ననును. ఆశీతగ్రాసము జీర్ణించులోపల శ్రాద్ధభోజనము దొరకును. ఆరాత్రికి నింటిలో రహస్యభోజనమునఁగా నేదో యింత మజ్జిగఅన్నము దినును.

నారాయణభట్టు వచ్చి కూరుచుండఁగా జానకీబాయి తండ్రి జాతకములను జూపించెను. అందు 3 జాతకములవారించుక దక్షిణ సమర్పించుకొనిరి. ఒక్కరేమియు నీయలేదు. ముందువచ్చి మాటలాడువాఁడు లేడు. కాన అన్నిజాతకములలో దానిని బాగుగఁ జూచి తలయూచి పెదవి విఱిచెను. గృహస్థు ఏమండీ అని అడిగెను. జాతకము ప్రశస్తమైనదే ఏమిలాభము? పదునెనిమిదవయేట గండము కలదు. తప్పునేమో యని యింతసేపు విచారించితిని లాభము లేదు. నమ్మకము లేదు. తరువాత మీయిష్టము. తరువాత నన్నడుగవలదు.

అని నారాయణభట్టుత్తరము చెప్పెను. నడుము విఱిగినట్లు కాఁగా జానకిబాయితండ్రి రాధాకాంత త్రివేది వెచ్చనూర్చి తక్కిన వెట్లున్నవని ప్రశ్నించెను. అన్నింటిలో నీమూఁడును ప్రశస్తముగా నున్నవి. అందులో నిది యుత్తమోత్తమము. నిస్సందేహము. ధనభాగ్యలాభభావములు చక్కఁగానున్నవి. భార్యాసుఖముగలిగి యెనుబదియేండ్లు రాతఁ బొడిచినను జావు లేని యాయుర్దాయము గలిగినవాఁ డీజాతకుఁడు. గృహములు విశేషము కట్టుజాతక మిది. అని చెప్పెను. తొలినాఁటిగాత్రి యాపిల్లవానితండ్రి వేంకటేశ్వరులముడుపు సమర్పించెను. కాన గట్టిగా దానింగూర్చి తెలిపెను. నారాయణభట్టునకు బృహస్పతి దక్షిణయని నాలుగణాలు సమర్పించి సాగనంపి భార్యతో నాలోచించి యతనికే యీయ నిశ్చయించెను.

నారాయణభట్టు మెచ్చుకొనినవాఁడు బలరామద్వివేది. నిరక్షరకుక్షి. జూదమాడునలవాటు కొంచెముగాఁగలవాఁడు. రూపవంతుఁడు కాఁడు. వానియింటిస్త్రీపురుషులకు మంచివారి కడ మర్యాదలేదు. ఏవేవో చెప్పుకొందురు. వానిజోలి మన కేల? బలరామద్వివేది మూర్ఖాగ్రేసరుఁ డనవచ్చును. చామని చాయనశరీరము. కన్నులు ప్రత్తికాయలవలె నుండును. మిట్ట మొగము. పెదవులదాఁటి వెలుపలి కుబికినపండ్లు. చప్పిడి గడ్డము. బొమ్మున నొకభాగమున కాలినమచ్చ. ఇవి మొద లయినవన్నియు నాతఁడు రూపవంతుఁడే యని చెప్పక చెప్పు చుండును. ఆతనికే జానకీబాయి నీయ రాధాకాంతత్రివేది నిశ్చయించెను. భార్య యందులకు సమ్మతించెను. ముహూర్త నిశ్చయముచేసి నారాయణభట్టు పిల్లకడ వరునిసద్గుణములను

బోఁగడసాగెను. జానకీబాయి తనగతి యింతియే యనుకొని తండ్రిమాటకు మాఱుపలుకనోడి యూరకుండెను.

వివాహము మఱికొలఁదిదినములకే సాగెను. వధువును మెచ్చుకొనువారలే కాని వరుని జూచువారు లేకుండిరి. కొందఱు రాతని జానకీబాయికిం గుదిర్చిన దైవరని దూఱసాగిరి. నారాయణభట్టు రెండుగడియలలో వివాహతంత్రమంతయు నడిపెను. తఱచుగా వివాహోత్సవములలో మంగళవాద్యముల మ్రోఁగఁజేయుచుండుఁడని చెప్పుచుండుట భట్టుగారికి వాడుక. ఆసందడిలోఁ గొన్నిమంత్రము లెగవేయవచ్చు ననియుఁ దలయాడించుచున్న మంత్రముతో చెప్పినట్లే యుండుననియు నతనియభిప్రాయము. ఆనాఁడు జానకీబాయి మోమునఁ గాంతియే లేదు. ఆతనిఁ జూడవమ్మా యని పురోహితుఁడు చెప్పినప్పుడెల్లఁ దలవంచుకొని బెల్లముగొట్టిన ఱాయివలెఁ బలుకకుండెను. ఎట్లైననేమి? పెండ్లియైనది బలరామద్వివేదికూడ గృహస్థుఁడయ్యెను. జానకి పగఁ

వేడుకకై వధూవరులను గూరుచుండఁబెట్టఁ గొనఁగా జానకీబాయి సనేమిరా యనుచుండెను. దానిభావమేమని బంధువులందఱు గుజగుజలుపోవసాగిరి. ఎవరేమనుకొన్నను సరే యని యాపెండ్లికూఁతురు వరునిమోమునైనఁ జూడ నొల్లక యుండెను. తండ్రి యాయూహను గుఱుతించెఁగాని కొన్నిదినములకు మాఱిపోవుననియు సాధారణముగా నందఱం బోలి సంసారముచేయుననియుఁ దలంచి యూరకుండెను. తల్లి మాత్రము నిరంతరము విచారించుచునే యుండెను. ఎవరు

విచారించినను జానకీబాయి మాత్ర మా వ్రతమునకు లోపము రానీయక యుండెను.

పద్మావతియింటికి నీకాంతారత్నముండునింటికి నించుక దూరమే గలదు. జానకీబాయితో స్నేహముచేసికొనుట మంచిదని పద్మావతి తలంచుచుండెను. పురుషోత్తముదాసుకడ నుండు పరిచారిక జానకినిగుఱించి చెప్పుచుండఁగాఁ బద్మావతి వినుచుండెను. పెండ్లియైన పదునొకండవనెలకే జానకీబాయి పుష్పవతి యయ్యెను. ఈయిరువురకు నీరెండుసంవత్సరముల భేదమేకాని వయస్సు సమానమే యనవచ్చును. పద్మావతి కీయూహ గలుగునప్పటి కామె భర్తయింటికిఁ బోవననుటయు వారు పిలిచి పిలిచి విసిగి మానుకొనుటయు నలుగురు పెద్దలు కలిసి నారాయణభట్టుకు నాలుగుచీవాట్లు పెట్టుటయు జరగెను. తల్లిదండ్రు లుత్తములుగాన నపకీర్తికి భయపడి కొమార్తె నెంతయో బతిమాలిరిగాని యామె యిఁకమీఁద మీరు నాకావిషయము తెల్పిన హత్యచేసికొందునని తెగించి పలికినందున మ్రింగలేక క్రక్కలేక యెట్లో భరించుకొనుచు వగచుచుండిరి.

జానకీబాయి పాటయందు నేర్పుగలది. చిత్తరువులు వ్రాయుటకుఁ బెట్టినపేరు. ంగులతో పటములు వ్రాయుటలో మొదటితాంబూలమునకుఁ దగినది. ప్రౌఢ కాఁగా మోమునందము పూర్ణముగా నమరియుండెను. లు సోగలై నల్లఁగలువరేకుల గేలిచేయుచుండెను. బాహువల్లరులు సాగి కోమలతకుఁ గొఱంతరానీయక సొంపుగా నుండెను. యౌవనము గర్వించి నాకెయ్యది యీడని పలుకఁ

బైకుబికినట్లు వక్షస్థలము మితిమీఱి ముందున కంజవేసి నట్లుండెను. దానిమిట్టిపాటును జూడఁజాలక దుఃఖించి దుఃఖించి నడుముసన్నగిల్లిపోయెను. ఱొమ్ముబరువును నడుము మోయఁజాలదని పిఱుఁదులు తోడుపడఁబూనినట్లు విజృంభింపసాగెను. ఇన్నింటిని మోయఁజాలక పాదపల్లవములు మందగతి వహించెను. చక్కఁదనమంతయుఁ జూపులలోఁ గాఁపురము చేయఁబూనునట్లు కటాక్షవీక్షణములు క్రొత్తసింగారమును గనఁబఱుపసాగెను. ఎఱ్ఱగానుండు క్రిందిపెదవి యద్దములవంటి చెక్కిళ్ల నిగనిగలు సోఁక నించుక తెల్లఁదనము పొడసూపఁ బగడములరంగుగలిగి చూడంజూడ నాసగొలుపుచుండెను. "అందలోకయొత్తు. అగస్త్యుఁడొకయొత్తు" అన్నట్లు ముక్కు సర్వాంగసౌందర్యమును మించి మిట్టిపడుచుండెను. ఆమె దేహమున కాభరణము లలంకారములుగాక యాభరణముల కామె దేహభాగములే యలంకారములుగా నుండెను. వీథినిబోవువారందఱా జానకీబాయియింటికడ మందగమనము నభినయించుచు వచ్చుచున్నవారితో మాటాడునెపమున నిలువఁబడుచు విధిలేక పోవుచుందురనుట సాధారణమేగాని విశేషోక్తిగా నేరదు. సాయంకాలమునఁ గూరుచుండి వాద్యధ్వనితోఁ గలిపి కంఠమెత్తి పాడుచు,

"హాప్రియా నినుఁ బాసి నే నేప్రకారము సైతురా"

అనుపాటను బాడుచుండఁగా, వీథివెంటఁబోవు కోడెగాండ్రు గుండె దిటవుచెడఁగా నడుగు ముందు పెట్టఁజాలక యుందురనుట సత్యమున కంతదూరము కాదనవచ్చును. మొత్తముమీఁద జానకీబాయి మిటారి యనుప్రఖ్యాతిని గనియెను.

ఒకనాఁడు పురుషోత్తమదాసుపరిచారికను బద్మావతి పిలిచి యేమో మాటలాడుచు నాకుఁ బ్రియసఖిని సంపాదించుకొనవలయునని తలంపు గలదు. ఈడుజోడుగా నుండవలయును. మనస్సులోనిమాటలు చెప్పుకొనఁదగినదిగా నున్న కదా అనుకూలము. అట్లు గాకున్న లాభమేమి? నీకుఁ దెలిసియున్న నట్టిదానిం దెల్పుమని యడిగెను. అంబష్ఠజాతికిఁ జేరినదైనను మాటలాడుటయం దెంతయో చమత్కారముగలది. విచారమును గూడఁ బోఁగొట్టి ఉత్సాహమును గల్గించునట్లు మాటలాడఁగలది. కనుకనే ఆవీథియందుండు పండితు లాపరిచారికను ప్రియంవద యని పిలుచుచుండిరి. ఒకరిమాట వేఱొకరికిఁ దెల్పక యెంతకాలమైనను రహస్యము దాఁచుచు మర్యాద ననుసరించి మాటలాడుచు జీవించుచుండునది కాన నెపుడు నాపరిచారికను గనరువారు గారైరి. ప్రియంవద యను పేరే దానికిఁ బ్రసిద్ధమయ్యెను గుణవంతురాలుగా నుండెను కాని పురుషోత్తమదాసుమూలమున నించుక మరియాదతప్పి నడుచుకొన నలవాటుపడెను. ప్రియంవదతప్ప దాసునకు సాయము లేకుండెనని పాఠకు లీవఱకే చదివియుందురు. ఇంట నుండు నాఁడువారు లేకుండఁగా ధనము వచ్చుచుండఁగా ఈ రెండింటికిఁ దోడు చపలత యుండఁగా మనస్సులోనిమాట చెప్పఁదగిన పరిచారిక యుండఁగా నేవి యలవాటుపడిన పడ వచ్చును. కాని యెవరేమందురో యనుజంకు మాత్ర మాందాసున కుండెను. భుజంగద్వివేదివంటి మిత్రుఁడు కలఁడు. కాని యతనిమాట నెవ్వరు నమ్మకపోవుటచేత నతనిమూలమున నేపనులు నెఱవేఱవని దాసు తెలిసికొని మనసునకు మనసే

సాక్షియన్న ట్లూరకుండెను. ప్రియంవదవంకఁ దనకార్యములు ఫలించునని దాసు తలంచెను.

పద్మావతి యిట్లు తన్నడుగఁగా నాప్రియంవద వేఱొక తరుణమున నీ కావిషయముం దెల్పెదను. మీకుఁ దగినసకియ కలదు మీకుఁ దగినదే యనవలయును. మీకామెతో నేస్తము కుదిరిన బంగారమునకు వెలిగారము దొరకినట్లే. నేనొక ప్మ కముగలదానవని తలంచి నన్నడిగినదే పదివేలు. నాచేత నైన యంత సాయము చేయుదును. ప్రాణములైన నిత్తును. ఈదేహము స్థిరమా? ఉన్న నాలుగుదినములు మంచి యనిపించుకొని పోవుట మంచిది. ఇప్పుడు దాసుగారు నన్నుఁ బిలుచుసమయము. ఆమహానుభావుని దయవలన నున్నదాన. అంతదయ గలవా రీలోకమున మఱియొక రుందురా? అని యింక నెక్కువగాఁ జెప్పుట కార్యభంగమునకుఁ గారణమగునేమో యని తలంచి మంచిమాటలాడుచు మరల రేపో మాపో కలిసి మాటలాడుదునని చెప్పుచు నింటికిఁబోయి నవ్వుచు దాసుదగ్గరకుఁ బోయెను. ప్రియంవదా! యేల సంతోషమున మునిఁగి పోవుచున్నావని దాసు ప్రశ్నించెను. పద్మావతమ్మ మాటలాడుచుండఁగా వచ్చితిని. ఆసంతోషమే యిదని మఱేమియుఁ బలుకక యింటిపనులు చక్కఁబెట్టుచుండెను. దాసునకు మనస్సు స్థిరముగాలేక యేమో యడుగఁబోయి యేమో యడుగుచుఁ గొంచెము రహస్యముగా మాటలాడవలసియున్నది. కాన నాపనులఁ జక్కపెట్టి రమ్మనఁగా నవ్వుచు నే యట్లే యని బదులు చెప్పి పనులు చేయుచుండెను.

# నాల్గవకళ.

కుమారస్వామి నగరమున నివసించుట. పద్మావతి సంచరించుట.
యశోదమ్మ కొడుకునకు హితముచెప్పుట.
పద్మావతికి జానకీబాయికి స్నేహము కుదురుట.
వీరికిఁ బ్రియంవదకు మిక్కిలి స్నేహము కుదురుట.

కుమారస్వామి నగరముననే నివాస మేర్పఱచుకొనఁ గోరెను. ఆనగరమునఁ బెక్కండ్రు గృహస్థులు పరిచితులైరి. నోటిలో నాలుకవలె నందఱకు మంచివాఁడుగాఁ దోఁచునట్లు వర్తించుచుండెను. అన్నవస్త్రములకుఁ గొదువ లేకుండెను. కాన నానగరమునందే గృహమేర్పఱచుకొని యుండఁ దలంచెను. యశోదమ్మ కంతగా నది యిష్టములేకున్నను గోడలు కొడుకు ఒప్పుకొనఁగాఁ దాను వలదన్నను లాభములేదని యెంచి మర్యాద గాపాడుకొని నూరకుండెను. పదుగురి నాశ్రయించి యొకమూల నొకగృహము నిర్మించుకొని తల్లియు భార్యయుఁ దాను నందుఁ గాఁపురముండిరి.

ఆనగరము శైలపురమని ప్రసిద్ధిగాంచెను. నలుప్రక్కలఁ గొండలుండుటంబట్టి యాపేరు వచ్చినదని వాడుక గలదు. దగ్గరగా నన్నిప్రక్కలను గొండలుండకున్నను ఇంచుక దూరమున నున్నట్లే యగును. కోటగోడలు కొండలే యనవచ్చును. అవి వర్షపర్వతములు గావు. కాన నీరుదొరకుట వేసవికాల

మున నించుక శ్రమమే. నగరము కట్టినతావునకన్న నలు వైపుల నుండుభాగము లెత్తుగా నుండుటంజేసి యెండలు మెండనక తప్పదు. అవి మిక్కిలిగా నుండునపు డారోగ్యము తక్కువయగుట స్పష్టమేకదా. అందుండువారు తఱచుగా నీల వర్ణముగలవారలు. ఆనగరముగలదేశము మాళవదేశమని పిలువఁబడును. ఆదేశమున నాగాద్రి ముఖ్యపర్వతము. దక్షిణోత్తరములకు నది సాగినట్లు కనఁబడును తూర్పుపడమరలకుఁ గూడ వ్యాపించియుండును. కనుకనే నాగాద్రి యని పేరు పెట్టిరని కొందఱందురు. ఆకొండపైనను గ్రిందుగను అనేక శివాలయము లున్నవి. వెదురుటడవి మెండుగనుండుట కీచక పర్వతమని కూడ నది పిలువఁబడును. ఆదేశమున ముఖ్యనది మృత్యుంజయనది. సర్వదా ప్రవహించు నందురుగాని కొన్ని నెలలు ప్రవాహము కానరాకపోవును. అపు డది గుప్తగామిని యనఁబడును. దేశముం సారవంత మనవచ్చునుగాని వర్షములు తక్కువగావున సామాన్యమయ్యెను శైలపురము నదీ ప్రాంతముకాదు. మృత్యుంజయనది యించుకసమీపమునందుఁ బ్రాక్పశ్చిమములకు వ్యాపించియుండును. ఆనగరమున నుండువారు గొప్పపర్వకాలములయం దానదికిఁ బోయి స్నానము చేయుదురు. ఆదేశము దేవమాతృక గావునఁ దటాకము లనేకములున్నవి. కొన్ని నిండును. కొన్ని యెండియుండును. శైలపురము చూడఁదగిన పట్టణముకాదు. ఏదేశమునందును గానరానివిధమున నందలిగృహములు కట్టఁబడియుండును. శాస్త్రమునకుఁగాని లోకాచారమునకుఁగాని అనుకూలించియుండని రీతిగా నవి యుండును. అందలివా రల్పసంతోషులు. కాని

యసూయాపరవశులు. అశక్తదుర్జనత్వములు తఱచుగాఁ గానఁబడుచుండును.

శైలపురమునకు రెండుదిక్కుల నొకచిన్ననది వ్యాపించి యుండును. ఒక్కప్రక్క జలాశయము గలదు. ఒక్కప్రక్క కృత్రిమనది కలదు. ఇవన్నియు మంచినీరు కావలసిన కాలమున నిర్జలములుగ నుండును. వర్షము కురియుతరి జలముగలిగి యుండును. కావున నానగరవాసులు దాహోగకమునకై చేతులు చాపవలసినవారే యగుదురు. సౌధములసంఖ్య చాల కొలఁదిగ నుండును. వీథులు తీర్చినట్లుండవు. దక్షిణోత్తర ములకుఁ బెద్దవీథులు రెండు సాగియుండును. తక్కినవీథులు తూర్పుపడమరలకు సాగియుండును. వీథులు వెడలుపుగా నుండక యిరుకుగా నుండును కొన్నివీథులకుఁ గ్రొత్తపేరులు పెట్టఁబడినవి. ఆపేరు లావీథిప్రవర్తనమును దెలుపును. మొత్తముమీఁద నానగరము శృంగారముగా నుండదని తేలక మానదు.

కుమారస్వామి పద్మావతింగూడి యొకవీథి నివసించెను. ఆవీథి పెద్దవీథినుండి పడమరకు సాగి యిరుకుగా నుండును. ధనవంతు లందు లేరు బ్రాహ్మణు లెక్కువసంఖ్యగా నుండిరి. అందొక గృహము నిర్మించుకొని యిరుగుపొరుగువారుబ్రాహ్మణు లనియు నందఱు తనకు మిత్రులని మడికట్టుకొని నిర్భయ ముగాఁ దిరుగవచ్చునని యాతఁడు తలంచెను. తల్లి భార్య తాను నెమ్మదిగా నుండవచ్చునని తలంచి యిల్లు కట్టుకొనియెను. నలుగురుపెద్దమనుష్యులు సాయముచేసిరి. కాన నొకకుటీరము నిర్మించుకొనఁజాలెను. ఆవీథికి మళయాళమని పేరు గలదు.

ఏయర్థమునుబట్టి యాపేరుగల్గెనో యూహింపవలసియే యుండును. ఆవీథియందే పురుషోత్తమదాసుగృహము గలదు. భుజంగద్వివేదియిల్లు కూడ నందే గలదు. ప్రియంవద కావీథి యందుఁ బలుకుబడి యెక్కువగా నుండును.

కుమారస్వామి యింటినుండి మఱొకవీథి దక్షిణోత్తరములకు సాగియుండును. చతుష్పథమును పేరున కది తగునన వచ్చునుగాని యుత్తరమునకు సాగినది యించుక పడమరకుఁ బోయినఁగాని ఆరంభముకాదు. అసలువీథిమాత్రము తూర్పు పడమరలకు సాగియుండుట సత్యము. అందు నుత్తరశ్రేణి యందు, నుత్తరమునకు సాగియున్నవీథికిఁ దూర్పున దక్షిణమునకు సాగియుండువీథికి నెదుట కుమారస్వామిగృహము కలదు. పురుషోత్తమదాసు గృహమునుండి పురోహితునియిల్లు రవంత పడమరగా నుండును. నడుమ నాలుగిండ్లున్నవి. ఈరెండు గృహములు తక్కినయిండ్లకంటె రవంత ముందునకు సాగి నందున నిందున్నవారచటికి నందున్నవారిచటికిఁ గనఁబడు చుందురు. కుమారస్వామి పురోహితుఁడు మంచివాఁడు నగుటంజేసి యావీథివారందఱు నతని గౌరవించుచుండిరి. వినయము భూషణముగదా. నోరుమంచిదైన నూరు మంచియన్న సామెత యందఱెఱింగినదియే.

కాఁపురమునకు వచ్చిన కొలఁది నెలలకే పద్మావతిచర్య యించుక మార్పునొందెను. కుమారస్వామి నగరమునఁ దిరుగు చుండువాఁడు. పురోహితుఁడు గాన నందఱిని గనిపెట్టి యుండువాఁడు. యశోదమ్మ ప్రాఁతకాలమునాఁటి యాచారములు కలది. పద్మావతి పూటపూటకు మార్పునొందు క్రొత్త

యాచారముల కలవాటుపడఁ గోరునది. ఈయత్తకోడండ్రకు పొత్తు కుదురునా యని పాఠకులను ప్రశ్నింపవలసియున్నది. ప్రొద్దున లేచి కుమారస్వామి స్నానముచేసి విభూతిమాత్రము పూసికొని జపమొనర్చిన ట్లభినయించి కనుబొమలనడుమ కుంకుమరేఖ యలవరించి పంచాంగము కనఁబడకయుండ నొక తెల్లనిగుడ్డ చుట్టి పట్టంచుగల్లె జన్నిదమువలె వైచుకొని పాదరక్షలు దొడిగి బయలుదేఱువాఁడు. పద్మావతియు ప్రాతఃకాలకృత్యములఁ దీర్చి స్నానముచేసి యరుంధతివలెఁ గుంకుమబొట్టు పెట్టుకొని యాదేశమునలవాటు ననుసరించి తేయాకునీరు త్రాగి రెండుసారులు త్రేచి వంట యీరీతిగాఁ జేయవలయునని యత్తకు నాజ్ఞాపించి వలిపెంపుఁజీర ధరియించి పూలఱవిక దొడుగుకొని కాచపాత్రములోని పన్నీరు చల్లుకొని రవంత తాంబూలము వేసి దానిరక్తిమ పెదవులఁ గనఁబడి కనఁబడకుండ నొనరించి పరిమళచూర్ణము తాంబూలమున మేళవించి ప్రక్కయింటి కనకమ్మ పిలుచుచున్నదని యేదో యొకపేరు చెప్పి యావీథిఁ గల యొకటిరెండిండ్లకుఁ బోయి యాఁడువారు కనఁబడిన నేమోమాటలాడి పురుషులే ముందు కనఁబడినఁ జిఱునవ్వు ముందు మాట దానివెనుకగా మాటలాడుచు నావంటి బీదరాలితో మాటలాడుదురా యనుచు రవంతసేపైననందుండక ఆవల నరుగుచు నిట్లే తిరుగుచుండి రెండవజామురాఁగా నింటికి వచ్చి అత్తగారినడిగి వంట యింకను గాలేదు. ఆలస్యమున్నదనఁగానే రాకాసివలె నాలుగుచీవాట్లు పెట్టి యుయ్యాలపీఁటపైఁ గూరుచుండి యుండును. కుమారస్వామి యేవో నాలుగు మాటలు పట్టుకొనివచ్చును. పద్మావతి యుయ్యాల దిగకయే

నవ్వుచు మాటలాడును. ఆవెఱ్ఱిబాపఁడు సంతోషమున మాట లాడినదే చాలుననుకొనుచు, అమ్మను బిలిచి మూటలువిప్పి యీ వస్తువులను జాగ్రతచేయుమని హెచ్చరించి స్నానముచేసి ఘం టానాద మాత్రమున దేవతాపూజ ముగించి భుజించువాఁడు. క్రొత్తభార్యయని యందగత్తెయనికోరి వివాహమాడిన తరుణీ మణియని తనతోఁ గూరుచుండి భుజింప నమ్మని పిలిచి ప్రక్కనఁ గూరుచుండి యామె భుజింపఁ బాగును భుజించువాఁడు. యశోదమ్మ కొడుకు కోడలు కూరుచుండి వేడుకగా మాటలా డుచు భుజించుచుండఁ జూచి యానందించుచుండును. నాల్గవ జామున మరలఁ బయనముచేయువాఁడు. రాత్రి యగుచు దాఱు గడియలు జరపిగాని రాఁడు. దీపములు పెట్టినతర్వాతఁ బూజలుచేయువారికి నవి చేయించి వచ్చువాఁడు. పద్మావతియు సాయంకాలమున చక్కగా దువ్వుకొని జడ వ్రేలాడవైచుకొని యేవో పూవులుముడిచి క్రీఁగంటిచూపులు పొలయఁ దిరుగఁ బోవును ఒక్కొక్కదినము సమీపవీథులకుంబోయి యందుఁ గల పూర్ణాంబను జూచి మాటలాడుచుఁ గూరుచుండి తోఁచి నపుడు వచ్చును. రాత్రిభోజనానంతర మెచ్చటికిఁ బోవక యుండును.

ఆమాళవదేశమున సాధారణముగా పూర్ణాంబిక మంగ ళాంబిక యనుపేరుగల దేవతలయాలయము లుండును. తఱ చుగా నాదేవతలపేరులే పెట్టఁబడును. ఆరెండుపేరులు స్త్రీజన సాధారణములై యుండును. పూర్ణాంబ విధవరాలై యానగర మునఁ జేరినది. నలుగురిని మంచిమాటలాడి పరిచయము సంపా దించుకొనియుండెను. తండ్రియుఁ దోఁబుట్టువు నామెతోడ

నుండిరి. తండ్రి పూర్వకాలపు నడవడిగలవాఁడు. తోఁబుట్టు వీమెకంటెఁ బెద్దది. వారిలో నీమెయే మాటనేర్పరి యన వచ్చును. ముప్పదేండ్లకు మీఁఅని ప్రాయము గలది. సోగ మొగము, నల్లని నెఱికురులు, మెడలో నొకస్వర్ణహారము, మంచినడక కలిగి, యామెయు నలువురికిఁ గావలసినదే యయ్యెను. ఆమె యుండువీథి పెద్దవీథి యని పేరుపొందెను. పద్మావతి యింటిదగ్గరనుండి యుత్తరమునకు సాగినవీథి యా పెద్ద వీథిలోఁ జేగును. పూర్ణాంబకుఁ బద్మావతికి మిక్కిలి స్నేహము. బావదగ్గర నుండినప్పటినుండియు వీరికి స్నేహము గల్గియుం డెను. పద్మావతి గొంతెత్తి పాటపాడినఁ గండుఁగోయిలలు సిగ్గు పడి క్రిందఁ బడిపోవుచుండెడివి. పూర్ణాంబ సంతోషమున నొక్కింతపాట యారంభించెనా కోయిలలతల్లులు భీతిల్లి దొర్లు చుండును. వీరు పరస్పరము మెచ్చుకొనుచుండువారు.

ఒక్కనాఁడు పద్మావతిం బిలిచి సాయంకాలము వచ్చిన నేదో నాలుగుకబుర్లు చెప్పుకొనవచ్చును గదా. రాఁగూడదా యనెను. తప్పక వత్తునని యది మొదలు ప్రొద్దుగ్రుంకునప్పటికిఁ బూర్ణాంబయింటికిఁ బోవుచుండెను. పనిలేనివారెల్ల నందుఁ జేరుచుండిరి. ఈమాట ఆమాట చెప్పుకొనుచు నెవరిండ్లకువారు పోవుచుండిరి. ఈమూలమున నలుగురికి పద్మావతి యున్న దనియు మనజట్టులోఁ జేరినదనియు నావీథివారెఱింగిరి. వారి మూలమున నావీథివారందఱకుఁ బద్మావతి యనుయువతి యొకతె యున్నట్లు నలువుర కుపయోగించుననియుఁ దేటపడియెను.

ఆవీథికి నందనారామ మనిపేరు. అందుఁగల నారీమణులు తఱచుగా నచ్చరలంబోలి యుందురఁట. కాన నాపేరు వచ్చె

నందురు. పూర్ణాంబ యింటికి రెండవయింట మంగళాంబ యుండును. దానితర్వాతి గృహమున జానకీబాయి యున్నది. కృష్ణాకుమారియు నందే యుండును. నాలుగిండ్లతర్వాత నామె గృహము. ఆమె శాశ్వతబ్రహ్మచారిణి యనుట పాఠకులు మఱచిపోవరాదు. ఈనలుగురు నొకచోటఁ జేరి సల్లాపములఁ గాలము పుచ్చుట వాడుక. పద్మావతియు నావేళకు నందుఁ జేరు చుండుట కలవాటయ్యెను. పంచరత్నములని, నవయువతీపంచక మని, మిటారులపిండు అని వారు పేరొందిరి కొలఁదికాలమునకే పద్మావతిపేరు పదుగురనోళ్ల నానఁజొచ్చెను.

మఱియాళమునందుండు పద్మావతి కావీథిలోనుండు వారిలోఁ జెక్కుంద్రకు పరిచయము గలిగెను. వీథిలో నిలు చుండి నవ్వుచు మగవారితో మాటలాడుచుఁ దాంబూలము వేసికొనుచు నుండుపద్మావతిం గాంచి యశోదమ్మ విచారపడి కోడలి నేమన్నను దిరుగఁబడునని భయపడి కొడుకొకనాఁడు ప్రతిదినము వచ్చెడువేళకుముందే వచ్చి యింట నొంటినుండం జూచి దగ్గరకుఁబోయి, "నాయనా! ఒక్కమాట చెప్పెదను." ఎవ రికిఁ జెప్పవుకదా. నాతోడుసుమీ! యని కొడుకు కందుల కంగీక రించి చెప్పవమ్మా యని యడుగ మఱింత దగ్గరకు జరగి యిట్లు చెప్పెను. "నాయనా! మనయింటిమర్యాద యెఱుంగుదువుకదా! మనపిల్ల యిల్లిల్లు తిరుగుచుండ నేమి బాగుండును? కొంచెము దండింపకున్న నెట్లు నాయనా!" యని యింతమాత్రము చెప్పి యూరకుండెను. కుమారస్వామి యిపుడెక్కడనున్నదని ప్రశ్నిం చెను. నాయనా! నీవిటు పోవఁగా నది యటు పోవును. దినదిన మిదేపరుసరా. కనుఁగొమ్మా యనిపల్కి యింటి పనికై లోపలకుఁ

బోయెను. తోలుతనే యనుమానించి యుండువాఁడు కానఁ దటాలున లేచి యేదో పని పెట్టుకొని పోయినట్లు నాలుగిండ్లు తిరిగివచ్చి యెందుండవచ్చునని తల్లి నడిగి పూర్ణాంబయింట నుండవచ్చునని యామె తెలుపఁగా నచ్చటికిం బోయెను. మంగళాంబయు, జానకీబాయియుఁ, గృష్ణాకుమారియుఁ, బద్మావతియుఁ బూర్ణాంబయింటఁ గూరుచుండి వేడుకగా మాట లాడుచుండిరి. ప్రియంవద వారిచెంతఁ గూరుచుండి యుండెను. కుమారస్వామి వారింగాంచి యేమియు ననుట కిది సమయము గాదని పూర్ణాంబతో మాటలాడఁ బోయినట్లు నటించి యప్రస్తుతముగాఁ గొన్ని మాటలాడి యెక్కడికో పోవవలసియున్నట్లు వెడలిపోయెను.

పద్మావతి తనభర్త పురోహితుఁడుగాన నెవరియింటికో పోయెనని తలంచి యింటికిఁ బోదయ్యెను. ఇతఁ డేమన్నను బావయింట నుండవచ్చునని యామె తలంచెను. కావునఁ గుదురు గదలక యందే యుండఁగల్గెను. కుమారస్వామి వేఱు మార్గమున నింటికిం బోయి తల్లితో జరగినదంతయుఁ దెలిపి దీనిని వదలివేయుట మంచిదమ్మా యని వగచెను. యశోదమ్మ ఓర్పుగలసాధ్వి. కాన నాయనా! చిన్నతనముగాన నింటనే యుండఁజాలక తోడివారలంగూడి పాటపద్యము పాడుకొను చుండవచ్చునని పోయి యుండును. దానిచే నష్టమేమి? క్రమముగా దానికే బుద్ధివచ్చునులే. ఇపుడేమన్నను బండువంటి కాపురము పాడగును ఓర్పుగలిగియుండుమని హితముపదేశించెను. కారాలు మిరియాలు నూఱుచున్న కుమారస్వామి యింతలో పద్మావతి రాఁగానే ఆఁ ఊఁ అనక నవ్వుచు మాటలాడసాగెను.

మగనిఁకీరత్వ మంతకుమున్నే పొటగిఁగియుండు పద్మావతి యసని లెక్క చేయకయుండెను. ఏల అచ్చటికిఁ బోయితివనిగాని, ఇఁకఁ బోవలదనిగాని యన భయపడి యథాపూర్వముగానే యుండెను

ఆనాఁడు మరల వచ్చి మాటలాడుదునని పోయిన ప్రియంవద యొకనాఁటి సాయంసమయమున విహారమునకుఁ బద్మావతి ముస్తాబు చేసికొని పోవఁదలంచుచుండఁగా వచ్చెను. అదృష్టవశమున యశోదమ్మ యెంగులతో మటొకవీథిన యున్న బంధువులయింటికిఁ బోయియుండెను. ఎవరు లేనిసమయము కదా యని ప్రియంవద లోపలికిఁ బోయెను. ఎంత కాలమునకు వచ్చినావే ప్రియంవదా యని పద్మావతి మందలించి కూరు చుండుమని లోపలికిఁబోయి తాంబూలమునకుఁ దగినవస్తువులు గలపెట్టెను దెచ్చుకొని కూరుచుండి తమలపాకులు నములుచు నవ్వుచుఁ బ్రియంవదా! ఆనాఁటిమాట యేమి చేసితివే యని యడుగుచుఁ దాంబూలమీయ నములుచు నది యిట్లు చెప్ప సాగెను. అమ్మా! దేవుని పద్దునను దాచి చెప్పుచున్నాను వినుము. జానకీబాయి చాల బుద్ధిమంతురాలు నాట్యము నేర్చుకొన్నది. చక్కగా పాడఁగలదు. అంపగత్తె యని నేను జెప్పనక్కఱ లేదు గదా! మగనిని వదలివేసినది. వాఁడు అప్ర యోజకుఁడు. ఏమి చేయఁగలదు? వదలివేసినను ధీరురాలుగాన ఆచింత పెట్టుకొనక నెమ్మదిగా నున్నది. వయస్సువచ్చినపిల్ల. ఏమి చేయఁగలదు? వలదు నాకు వాఁడని మొత్తుకొనుచున్నను వానినే అంటఁగట్టినారు. కర్మమా అని యేమనుకొనక మెల్లఁగా వానిని వదలియున్నది. నేనొక్కతెనే యామె వద్ద

స్నేహిఁగినదానను. నాతోఁ జెప్పనిమాట యొకటియు నుండదు. నన్నుఁ దనప్రాణముగాఁ జూచుకొనును. నాలుగు నెలలుగా హాయిగా నున్నదని నవ్వెను. ఏటికే నవ్వెదవని పద్మావతి యడిగెను. ఏదో జ్ఞాపకము రాఁగా నవ్వితినని యది బదులు చెప్పెను. నాకు అంశమాత్రము తెలియదనుకొన్నావా? ఆవులించిన ప్రేఁగులు లెక్కింపఁగలనులే. చెప్పు. చెప్పు. దాఁచిన నాకుఁ దెలియదనుకొన్నావా? యని నవ్వుచు నడిగెను. ప్రియంవద పకపక నవ్వుచు చేతిలో చేయి వేయుమని యట్లు వేయించుకొని నాతోడు అను. అని యడిగి యట్లే పద్మావతి యనఁగా నేమి లేదమ్మా! చిన్నతనము. దానికిఁ దోడు చక్కఁదనము. ఆ రెండింటికి అలంకారమన్నట్లు చక్కనిపాట. ఇన్నింటినిమించిన నృత్యము అనునవి యొప్పియుండఁగా గోళ్లు గిల్లుకొనుచు నెట్లూరకుండఁగలదు? నీవే చెప్పుము. అనఁగానే పద్మావతి దగ్గరకు రావే. స్నేహమన్న నింకేమనుకొన్నావు? చెప్పవే. దాఁచెదవేల? నేను విన్నానులే. ఎట్లుసరిపడినదే అని నొక్కినొక్కి యడిగెను. ఒక్కనాఁడు నేను బోయి మాటలాడుచుండఁగా సీతాపతి గోస్వామి వీథివెంబడి పోవుచుండెను. కన్నుగీటి చూడవే ఆతని ననెను. ఏమిచూడవలెనమ్మా అందని మ్రాకుగదా అంటిని నన్నుఁ జేయిపట్టుకొని నా ప్రాణముల దక్కింపవే అని వేఁడుకొనెను. ప్రాణమైన నిత్తును. చెప్పునమ్మా యంటిని. వారము దినములుగా నీత్రోవ వెంట నిదే వేళకుఁ బోవుచున్నాఁడు. నావైపు చూచి విసుగుచెందినట్లు పెదవి విరుచుచుఁ బోవుచున్నాఁడు. కాన నేనొక్కపాట వ్రాసి యిచ్చెదను. నాఅక్షరములుగానియట్లు వ్రాసెదసు. ఆ చీటి యాతని కిచ్చిరమ్ము: ఇంత

మాత్రము తోడుపడితివా బహుమాన మిత్తును. ఇప్పింతును గూడ. ప్రాణము లున్నంతవఱకు నిన్ను మఱువను జుమీ అని బతిమాలెను. అట్లె కానిమ్ము. వ్రాసి యీయుమంటిని వెంటనే వ్రాసియుంచినపత్రిక దీసి చేతి కిచ్చెను. చదువుకొందునా అంటిని. నేనే పాడెదను. అని కోకిలకంఠమునఁ బాడెనమ్మా. అనఁగానే అందుఁ గొంత పాడవే విందామని యిష్టము. అనఁగాఁ బ్రియంవద యిట్లు పాడఁజొచ్చెను:—

తాళఁజాలనురా యీవేళ మంచిదిరా॥
మరునివిరిశరములు మాటికి మాటికి।
మనసు గలఁచఁగా మ్రాన్పడితినిరా॥ తాళ॥
సొగసుకాఁడవని చొక్కితి నెదలో
తగినరీతి నను దయ గనుగొనరా॥ తాళ॥
ఎదురు చూచి నాయెద బరువాయెను
సుదతి నన్ను గొని చొక్కఁబలఁకరా॥ తాళ॥

ఇదమ్మా యాపాట. లోపల నేమున్నదో చెప్పలేను గాని ఆపత్రిక నేను గొనిపోయి యాయన కిచ్చితిని. అమ్మా! నిజమనుకో. అబద్ధమనుకో. ఉస్సురని చదికిలఁబడి నేనేమని యడుగ నాలుగురూపాయలు నాకిచ్చి యేమో వ్రాసి ముద్ర వేసి యిచ్చెను. త్రోవలో కొంచెము విప్పి చూచితి ననుకో. అర్థముగాలేదు. సంస్కృతమమ్మా. అనఁగా పద్మావతి మొదట నేమి వ్రాసినాఁడే అని యడుగఁగా హృదయేశ్వరి అని యున్నదనెను. తరువాత నేమున్నదో యర్థముకాలేదా యని పద్మావతి యడుగఁ బ్రియంవద చిఱునవ్వును గనఁబఱచెను. అంత వారిరువురు గుసగుస నేమో మాటలాడుకొనిరి. మరల రేపు

వచ్చి మాటలాడెద నని చెప్పి ప్రియంవద వెడలిపోయెను. పద్మావతియు నాఁడు పోవఁ దలఁచుకొన్న చోటికిం బోవక యింటనే యుండెను. యశోదమ్మ రాఁగా నింతసేపు నే నొంటరిగా నుండ నెక్కడికిఁ బోయితివని నాలుగుచీవాట్లు పెట్టఁగా నామె యేమనక యింటిపనులు చూచుకొనుచుండెను.

మఱుదినము ప్రియంవద రాఁగా మాటలాడి పద్మావతి పూర్ణాంబయింటికింబోయి యందుఁ బ్రవేశింపక జానకీబాయి యింటికిం బోయెను. ఈమె రాకకై వేచియుండు జానకీబాయి యెదురువచ్చి కొనిపోయి తగినతావునఁ గూర్చుండఁబెట్టి ప్రియంవదా! కూరుచుండవే. నీఋణము తీర్చుకొనఁజాలను జామీ. ప్రాణసఖివన నీవే. అని పొగడెను. ముప్వురు కూరుచుండి కష్టసుఖములను జెప్పుకొనుచుండిరి ఇంతలో నెవరో వచ్చి ప్రియంవదను సంజ్ఞచేసి రమ్మనిరి. వీథిగుమ్మము దాఁటి పోయివచ్చి యొకపత్రిక జానకీబాయిచేతి కిచ్చెను. దానిం జూడఁగానే యామెమోము గంపంతయయ్యెను. విప్పి చదువఁ బోవుచు మరల మూయుచు రెండుసారు లిట్లు చేయఁగా నేదో యనుమానమున నిట్లు చేయుచున్నదని తెలిసికొని పద్మావతి మరలవచ్చి మాటాడుదును. రేపు తప్పకవత్తును. జాముప్రొద్దెక్కినతరువాత నవకాశము దొరకునా యని యడిగి తప్పక రమ్మని యామె చెప్పి తాంబూల మీయఁగాఁ దీసికొని పూర్ణాంబయింటికిఁ బయనమయ్యెను. ప్రియంవద యింక నెక్కడికో పోయివత్తునని చెప్పి యందే యుండెను. తిరిగి చూచుచు వచ్చి మంగళాంబ కృష్ణాకుమారి కూరుచుండి పూర్ణాంబ యర్థము చెప్పుచుండఁగాఁ దారాశశాంకము చదు

వుచు నడుమనడుమ నవ్వుచుండఁగా నచ్చటఁ జేరెను. వారిరువురు నొకరిమాఁద్రి యొకరుగాఁ జదువుచుండిరి. పద్మావతి వచ్చునప్పటికిఁ గృష్ణాకుమారి మధురకంఠమునెత్తి

"లోకములోనఁ గొందఱబలుల్ సతులం దనియింపలేక య
స్తోకమనీష నన్యపురుషుల్ తమకాంతల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁగూడినఁ బాపమంచు న
య్యాకులపాటు చూచి యిపు డాకులపాటొదవంగ నేటికిన్?"

అనుపద్యమును జదువుచుండెను. ప్రియసఖి రాఁగానే మరల మొదటినుండి చదివెను. మధురకంఠమున నేది చదివినను బాగుండును. అందు స్త్రీకంఠము. మఱియు విషయము నట్టిదే. ఆపద్యము విని పూర్ణాంబ యర్థము ప్రతిపదమునకుఁ జెప్పి తాత్పర్యమును దెలిపి యందలిసార మిది యని తెలుపఁగా నానందసముద్రమున మునిఁగి తేలుచు ననేకోదాహరణములు చెప్పుచు దానియర్థము న్యాయసమ్మతమని తీర్మానించుచు తారవంటి యందగత్తెను ముదుసలి పురోహితుని కిచ్చిన యాతల్లిదండ్రులను గొంతులు గోసినను బాపములేదని నొక్కినొక్కి చెప్పుచు నవ్వుకొనుచుండిరి. ఆసందడిలో పద్మావతి అప్పటి మాటలు మనకేల? ఇప్పటి మనజానకీబాయి విషయమాలోచింతము. పాపము! బుద్ధిలేనివాని కిచ్చిన నామె ఏమి చేయఁగలదు? దేవుఁడా యని యూరకున్నదని చెప్పెను. మనమందఱము నొక్కదేవునిసే గొలిచినామమ్మా యని కృష్ణాకుమారి యనెను. నీకేమమ్మా పెండ్లియే మానుకొన్నావు. హాయిగానున్నావు కదా యని మంగళాంబ యనెను. పెండ్లిమానుకొన్ననేమి? అది యైనవారికంటె నెక్కువకష్టము లున్నవని

పూర్ణాంబ యోదార్చెను. కొద్దిగడియలు వారిట్లు మాట లాడుకొనిరి సాయంకాలము కాఁగా నెవరియిండ్లకు వారు పోయిరి. పద్మావతి యిల్లుచేరెనుగాని ప్రియంవదరాకకు వేచి యుండెను.

పద్మావతి వాకిలి దాఁటగనే జానకిబాయి పత్రికను బాగుగాఁ జదువుకొని కన్నీరు గార్చెను. ప్రియంవద యేమమ్మా యని యడిగెను. పాప మాసీతాపతిగోస్వామి యెంత యవస్థలో నున్నాఁడో వింటివా. అని

"సరసిజమిత్రుఁ డెప్డు గిరిచాటున కేగునొ యంధకారముల్
వరుసగ నెల్లతావులను బర్వునొ గాఢముగాఁగ సుందరీ
దరహసితాననం బెపుడు తద్దయుఁ జూచుచు మోవి యాన నె
త్తరుణమునందు భాగ్యము నితాంతము పండఁగఁ దృప్తిఁ గాంతునో."

అని యాపద్యముం జదివి ప్రియవందా! ఫలములు తెచ్చి యిమ్మా యని దానిం బంపి తా నలంకరించుకొనుచుండెను.

ఆమె యుండు గదితలుపు వీథిలోని కున్నది. మూఁడు దెసల దానికి గవాక్షము లున్నవి. మూడురంగులగుడ్డలు గవాక్షముల కడ్డముగా వేయఁబడినవి. ఆగది రెండుభాగ ములుగాఁ జేయఁబడినది లోపల శయనగృహమని, ముందు విలాసగృహమని పేర్లు పెట్టఁబడినవి. నిర్మాల్యములగువస్తువు లందమర్పఁబడియున్నవి. వీణ మృదంగము నందుఁ గనంబడు చుండును. చిఱుగజ్జెలు నొక్కచోఁ గనంబడును. నాట్య మున కవి యుపయోగించును. జానకీబాయి నాటఁ నలవాటుగలదని పౌరకు లెంచెంగియే యున్నారు. దక్షిణదిశ

యంపు ద్వారము గలదు. దాని కెదురుగ నొక్క నిలువుటద్దమున్నది. తలుపు తెఱిచియుంచినను లోపలనుండు తెఱచాప లోపలిభాగము కనఁబడకుండఁ జేయును. ఆనిలువుటద్దము ముందొక పెద్దబల్ల యున్నది. దానికి మూఁడు ప్రక్కలయందుఁ గూరుచుండఁదగిన కుర్చీలు గలవు. ఆబల్ల గుండ్రముగ నున్నది. జానకీబాయి యందుఁ గూరుచుండి ప్రాతఃకాలమును చిత్రలేఖనమునఁ బుచ్చును. రెండవజామున కొంచెము గడువఁగా భుజించును. తాంబూలము వేసికొనుచు నందే కూరుచుండి నాలుగుగడియలు పురాణగ్రంథములు కాక శృంగార కావ్యములఁ బఠించును. రెండవజాము వెళ్లుచుండఁగాఁ బవ్వళించును. మూఁడవజామున సగము కాఁగా మేలుకొనును. ఫలాహారముచేసి సంగీతమునఁ గృషి సల్పును. సాయంకాలము దనుక నట్లే కాలము పుచ్చును. సాయంకాల మప్పుడప్పుడు పూర్ణాంబమందిరమున కరుగుట కలదు. ఆగదికి నుత్తర భాగమునఁ గలద్వారము పెరటిలోనికిఁ బోవును. అందుండి తూర్పుగా వాకిలి గలదు. అది తండ్రిగారియింటికిం దీసికొని పోవును. ప్రక్కననున్నదే వారియిల్లు. ఈజానకీబాయికిగా నీయిల్లు నిర్మింపఁబడినదని పాఠకు లెఱుంగుట మంచిది.

ఆనాఁటి యలంకారము మిగులఁ గ్రొత్తగ నుండెను. ప్రియంవద ఫలములు తెచ్చియిచ్చెను. విదేశములనుండివచ్చిన యొక నిర్మాల్యపాత్రమున నవి యునుపఁబడెను. అత్తరుపు బుడ్డియు శ్రీచందనపుగిన్నెయు నందునుపఁబడియె. ప్రియంవద యందే నవంత సేపుండెను. సాయంకాలమయ్యెను. సంజగుఱుతులు కనఁబడసాగెను. పుట్టినింటివారు ప్రాతస్సాయంకాలముల

నచ్చుటకి రారు. చిత్రలేఖనము సంగీతాభ్యాసమున కితరులుండ రాదని యామె తలంపు. ఏకపుత్రిక, రూపవతి, విద్యావంతురాలు, చిత్రలేఖనమునఁ బాండిత్యముగలది, సంగీతమునఁ బేరు పొందినది. అట్టితరుణియం దేవో నాలుగులోపము లున్నవని కొంచము. వానిం గృపగల తల్లిదండ్రులు పాటింతురా? దీపములు వెలిఁగించు వేళ యైనది. నాలుగు ప్రక్కలందు దీపములు ప్రియంవదయే వెలిఁగించెను. ఆమె నిలువుటద్దముకడ నుండెను. జానకీబాయి పాన్పున కించుకదూరముగాఁ గూరుచుండి తటాలునలేచి పడమటిగవాక్షము చెంతకుఁబోయి చూచి గబగబవచ్చి ప్రియంవదా! వచ్చువారిని గూరుచుండుఁడని కుర్చీని చూపుము. క్షణము కూరుచుండినతర్వాతఁగాని నాకుం దెల్పకుము. అని హెచ్చరించి వీణమీటుచు గొంతెత్తి,

హా ప్రియా నన్ బాసిలే నే నేప్రకారము సైతురా॥ హా॥
పాపిమారుఁడు కోపియై పరితాపమొందగఁ జేసెరా॥ హా॥
యేమిపాపము చేసితినో మున్నేరి దూఱితినో కదా॥ హా॥

అని పాడి యోరచూపునఁ బాలఁ జూచి తనపాట విని తలుపు ముందు నిలువఁబడిన సీతాపతి గోస్వామిని జూచి తంత్రులను సరిచేయుచందము నటించుచు మరల సన్ననిస్వరమున

పిలువవచ్చియున్నాఁడు పెనిమిటి యీవేళ చెలికాఁడ పోయివత్తునా॥
వేళగానివేళ తిరువీధిఁ దిరుగకుము॥
మరులు మందులుపెట్టి మళ్లించుకొందురు॥ ॥పిలువ॥

అని శహాన అనురాగమునఁ బాడి నాలుగుమారులు రాగమును విసరి రెండవచరణము పాడఁబూనునంతలో ప్రియం

వద అమ్మా యెవరో దయచేసినారని తెలిపెను. ఎవరే మన యింటికి వచ్చువారు? అని యడిగెను. అమ్మా సీతాపతిగోస్వామి గారు పరమాదరమున ననుగ్రహించిరి. మీపాట వినఁగోరి కాఁబోలు. అనునంతలో జానకీబాయి మజే నాపాట విన వత్తురా? త్రోవతప్పివచ్చిరేమో అని తలఁచి యొకమా పుల నాతనికయిం బ్రవహింపఁజేసెను. పంతులుగారు దయ చేసి లోపలఁ గూరుచుండి వినండి మాయమ్మగారిపాట నని ప్రియంవద మరియాద యుట్టిపడఁ బలికినంతనే గోస్వామి లేచి నాలుగడుగులుపెట్టి ముసిముసినవ్వులఁ దన్నుఁ జూచు జాన! బాయిని చేరంజని యోమిటాకీ! నీవు మొదటిచరణ మె త్తితివి. నేను రెండవచరణ మెత్తెదను. అనుమతియేనా అను నంతలోఁ బ్రియంవద యిదిగో వచ్చుచున్నానని తలుపుమూసి కొని వెలుపలికిఁ బోయెను. వారిరువురే యందుఁ గూరుచుండి యభీష్టాలాపములు మొదలగువానిచేఁ గొంత కాలముం బుచ్చిరి.

ప్రియంవద తటాలునఁ బోయి పద్మావతిం గాంచెను. తనరాకకై వేచియున్నదిగాన దానిం గాంచినంతనే పకపక నవ్వుచు రావే ప్రియంవదా యని పిలిచి ప్రక్కనఁ గూరు చుండఁబెట్టుకొని కనుసన్న యొనరించెను. అది నాలుగు ప్రక్కలు చూచెను. మాఅత్త లేదులేవే. నిశ్చయముగాఁ జెప్పుమని యడిగెను. ప్రియంవద జరిగినవృత్తాంతమును బూస గ్రుచ్చినట్లు తెలిపెను. పద్మావతి యేమోచింతించుచున్నయట్లు కనఁబడఁగా నాదూతిక యేలనమ్మాచింత? నీకోరికఫలింపఁజేయు ప్రాణమువంటి నేనున్నానులే అనియెను. నా కేకోరిక లేదే

యని చిఱునవ్వుతోఁ బలికి తలవంచుకొన్న పద్మావతిం గాంచి యాదూతిక యేదీ నామొగము చూచి యీసారి ఆమాట అను మాతమని పలికి మోమెత్తెను. అబ్బా నన్నుఁ జంపకుమా యని మొగము త్రిప్పుకొనెను. ఇంకఁ బోదునా అని ప్రియంవద యడుగ నన్నేటిలోఁ ద్రోసిపోవే అని పద్మావతి కోపమున ననెను. నీకొఱకు నాప్రాణముల నిత్తునా? అడుగుము ఈయమన్న బట్టుపెట్టుమని యాదూతిక పలికి దగ్గరకు జరగ నాకీరాత్రి యెట్లు గడచునే యని కన్నీరు గార్చెను. త్వరపడకుము రేపు విశేషములు తెలిపెదనులే. అని తటాలున వీథివైపు గని యశోదమ్మ వచ్చుచున్నది. నేనుండరాదని ప్రియంవద పోవుచుండ, నేమే రేపు రాకున్న నేనుండఁబోను. తెలియుచా యని పలికి పద్మావతి యింటిలోనికిం బోయెను. ప్రియంవద దాసుగారియింటికిం బోయెను. యశోదమ్మ ఆయమ్మతోను ఈయమ్మతోను మాటలాడి యింటికి వచ్చుసరికి కోడలు చదువుకొనుచుఁ గూరుచుండియుండెను. అమ్మా ఒంటిగా నున్నావటే అని యశోదమ్మ యడుగ నిఁక నాకు దిక్కెవరున్నారు? అని బదులు విసుగుతోఁ జెప్పి "అత్తపగుల వేసినది ప్రాతకుండ, కోడలు వేసినది క్రొత్తకుండ." అన్నట్లున్నది మీసంచారమని యెత్తిపొడిచినట్లు మాటలాడ నింకఁబోనమ్మా అని యామె బతిమాలెను.

# అయిదవకళ.

మంగళాంబ పెనిమిటి నాక్షేపించుట. కృష్ణమూర్తి వారికి సంధిచేయుట.
పూర్ణాంబ మిత్రాపలసంపుడు చెప్పుటచుట.
దాసునభిప్రాయము ప్రియంవద పద్మావతికిఁ జెప్పుట.

మంగళాంబచరిత్ర మింకఁ దెలుపవలసినదియేమి కదా. ఆమె జననీజనకులు మర్యాదగల కుటుంబమునకుఁ జేరినవారలే. స్వదేశమున వృత్తిలేక మాళవదేశమునకు వచ్చి యుండవలెనని నిశ్చయించి శైలపురమునకు వచ్చిరి. రాజకీయోద్యోగమున కవుబద్ధ కౌట ధనవంతులకడ లెక్కలు వ్రాయునుద్యోగము సంపాదించుకొని యతఁడు [illegible] కాలము దొర్లించుచుండెను. వారి కిద్దరు కొడుకులు నొక కుమార్తెయుఁ గల్గిరి. అందు జ్యేష్ఠుఁడు క్షయరోగము (కుష్ఠువు) బాధింప నుండువాఁడు. రెండవవాఁడాగర్భనష్టుఁడు. వారి వెనుకఁ బుట్టిన యీకుమారికయే మంగళాంబ. ఈమె ముద్దులుమూటగట్టుచుండఁ జూచి పుత్రదుఃఖము నంతగాఁ బాటింపకయుండిరి. వివాహమునకుఁ దగిన యీడు రాఁగా స్వదేశమునఁగల బంధువుల కిచ్చిన రాకపోకలకు దూరమని మాని యీనగరమందే తమవలెనే వచ్చియున్న బీదవాని కిచ్చి పెండ్లిచేసిరి. ఆమఱుదినమునుండి యాయల్లుఁ డిల్లుచేరెను. దారిద్ర్యము పైఁగా దుఃఖములు వానికిఁ దోడుగా నల్లుఁ డిల్లుచేరుట యనునది దుస్సహములే యైనను గారాబుకొమరితం జూచుకొని వానిని మఱచి సుఖ

ముగానే యుండిరి. అల్లుఁడు సోమారి. తిని కూరుచుండి అవి లేవివి లేవని తప్పులు పట్టువాఁడే కాని యొక కాసైనను గణించువాఁడు కాఁడు. ఏమన్నను పిల్ల మనస్సు నొచ్చునని వారూరకుండ నలవాటుపడిరి ఒక్కఁడు సంపాదించుట పలువురు తినుట ఆసంసార మెట్లుండునో యూహింపవచ్చును. మంగళాంబ చదువు నేర్చి సంగీతముకూడ నభ్యసించెను. నలుగురిలో పాడఁజాలకున్నను కూనలమ్మ సంగీతము మాత్రము నేర్చెను. తనలోఁదాను పాడుకొనుచుండును. కంఠ మంతమంచిది కాదు కాని దాని మఱచిపోవఁజేయుమాటలు మాత్రము సొగసుగా నుండును. అందగత్తె యనవచ్చునని కొందఱందురు. లొట్టిపిట్ట వలె నెత్తుగాను అంతపొట్టియుఁ గాక పాటిగా నుండును. చామనచాయ. గుండ్రని మొగము, మేకకన్నులవంటి కన్నులు, రవంతపొడవుగా నుండుగడ్డము గలిగి యందగత్తెగానే యుండును. సొమ్ములమీఁదియాశకంటె చీరలమీఁదియాశ యామెకు మెండు. నానావర్ణములుగల పరికిణీలు చీరలు తండ్రి యెట్లో శ్రమపడి తెచ్చియిచ్చువాఁడు. రోజునకు మూఁడువిధములగు చీరలైన గట్టక మానునదియే కాదు. దైవవశమునఁ బుష్పవతి యయ్యెను. ఏదైన నుద్యోగము సంపాదించి యిమ్మని మామను బాధించుచున్న యల్లుఁడపుడా మాట మఱచిపోయెను. బ్రదికితినిరా స్వామీ యని యా గృహస్థువు హాయిగా నుండెను. కొలఁది నెలలు జరగఁగా ముహూర్త మెప్పుడని గోకసాగెను. పదుమూఁడేండ్లు నిండనిది నిషేకముహూర్తము జరపరాదని యాదేశమున నాచారము. దానిని మీఱిన నలుగురేమందురో యనుభయ మాతని బాధిం

చుచుండెను నలుగురితో చెప్పించి యొకసంవత్సరము కాలము జరపెను. నారాయణభట్టు చాలతో సేపటి మృగశిర నక్షత్రము మంచిదేకాని శుక్రవారమునాఁ డాడినందున దోషమనియు నొకసంవత్సరము పరిహారము శాస్త్రమున్న దనియుఁ జెప్పెను. ఆభట్టును జూచిన నల్లునికి మహాకోపము వచ్చుచుండెను. కాని దెబ్బలాడిన నింక రెండేండ్లు పనికిరా కసునేమో యని భయపడి యూరకుండెను.

మంగళాంబకు కృష్ణకుమారికి స్నేహ మాబాల్యమునవచ్చెను. జాతిబంధుత్వము లేకున్నను నొకగ్రామమునఁ బెరిగిన వేళకొలఁది మైత్రి చక్కఁగాఁ గుదిరెను. కృష్ణకుమారికి మాటలనేటు మెండు. మంగళాంబకు హాస్యనేటు మెండు. దినమునకు రెండుమూఁడుసారులు లేకున్న నొకసారియైనఁ జూడకయుండఁజాలని స్నేహము వారికిఁ గలిగెనని వదలరాదు. కృష్ణకుమారి వివాహము మానినదని యిదివఱకే తెలిసినది కదా. వారితెగలో నీమె యొకతుకయే బ్రహ్మచారిణిగా నుండ నెంచినదఁట. ఆనియమము సదా సాగునా యని కొందఱనఁగా సాగినంతవఱకు సాగనిండు. ఆపల చూచుకొందమని యామె యెవరికో బదులుచెప్పె నందురు. మంగళాంబ కృష్ణకుమారి యింటికిఁ బోవుటయేగాని ఆమె యీమెయింటికి వచ్చునలవాటు లేదు. ఈమెగృహము చిన్నది ఆమె గృహము పెద్దది. కృష్ణకుమారి ధనముగలది. మంగళాంబ బీదయింటిపడుచు. కావున నామెయింటికిఁ బోవుచుండును. ఆమెమూలముననే పూర్ణాంబయింటికిం బోవుట మంగళాంబ కలవాటయ్యెను. పూర్ణాంబ యిల్లు సకలవిధముల ననుకూలమైనది, విశాలమైనది

యు నగుటచేత నచ్చుటికిఁ జేరువారు.గొప్పబుద్ధిగలదగుట నలు గురికి ననుకూలముగా నుండెను. సాయంకాలము కాకముందే రత్నకంబళము పఱచి యుంచును. అందఱు చేరి కబుర్లు కథలు పాటలు సాగించి దీపములు పెట్టఁగనే లేచిపోవువారు. ఈయాచారము రానురాను తఱుగక వృద్ధియగుచుండెను

మంగళాంబ మఱికొన్నిదినముల కత్తవారియింటికిఁ బోయినట్లయ్యెను. నివాసముమాత్రము పుట్టినింటనే సతీపతు లన్యోన్యానురాగము గలవారైనట్లు నటించుచుండిరి. కొమరితపై మనస్సు మెఱింగి భర్త ధనార్జనము చేయలేనివాఁ డయ్యెఁగదా యని విచారమున నట్లున్నదని తండ్రి తలంచెను. తల్లిమాత్రము ఏమియు నెఱుఁగని వెఱ్ఱిదనియుఁ గొంతకాల మామె ననుసరించి యల్లుఁడే యుండఁదగుననియు నూహించెను. ఇరుగుపొరుగువారు తెలివితక్కువవాఁడగుట నామెను లోఁబఱచుకొనఁజాలకున్నాఁడని యతనినే తూలనాడసాగిరి. క్రమక్రమముగా కట్టుకొనువస్త్రము మామూలుకంటె రెండు మూరలైనఁ బొడవుగా నుండినఁగాని చాలదని యత్తమామ లెఱింగిరి. మఱి కొద్దిదినముల కిరుగుపొరుగువారు నెఱింగిరి. క్రమముగా నతఁడు అభ్యంగస్నానముచేయ మానెను. మంగళాంబ విచారమునకు మేరలేకుండెను. ఒకనాఁడు భార్యను దండింపఁగా మంగళాంబ యెదురుతిరిగి మాటలాడెను. జాగ్రత్తగా నుండుమని పతి హెచ్చరించెను. ఇఁకఁ జాలు నీసంపద. నీవున్నను లేకున్నను నాకొక్కటియే పొమ్మని ఆమె తూలనాడెను. తొలుత నది సంవాదముగానుండి కొంతసేపటికి వివా

దముగా మాటి తుదకు ప్రమాదము క్రిందికి దిగెను. ఎవరో నలుగురు చీవాట్లు పెట్టి నివారించిరి.

ఆనాఁడు మంగళాంబ కృష్ణాకుమారియింటికిం బోలేదు. కారణమేముండునా యని విచారించి ప్రియంవద కనఁబడఁగా నడిగెను. ఆటక్కులాడి యున్నదున్నట్లు చెప్పెను. పక్కన నవ్వి నారాయణమూర్తి త్రిపాఠిని బిలువనంపి యేమయ్యా! అమ్మాయి నేమో నోటఁబట్టనిమాట లంటివఁట. మర్యాద తెలియదా? ఆమెనా యనవలసినది? ఆమెయోగ్యత నెఱుంగుదువా? ఎంతమర్యాదగలపిల్ల యనుకొన్నావు? ఇది మర్యాదయా యని హెచ్చరించెను. చూచినవారందఱు తన్నే చీవాట్లు పెట్టుచున్నారే అని యేమనఁజాలక యూరకుండెను. ఆమెకే తుదకు జాలి తోఁచి త్రిపాఠిగారూ! ఈకాలపువారు లొంగియుండువారు కారు. మగనియందేలోపము లేక ధనవంతుఁడుగానున్నను లెక్కింపరే. ముందు గంపెడు పెట్టుకొనిన నీవే యాక్షేపించ నింక లొంగుదురా? ఏదో యొకరీతిగా కాలముగడుపుకొనవలెనుగాని గుట్టు బయటపెట్టుకొనరాదు. కావున నామె నేమనక యూరకుండవలయునని హితము దెలిపెను. పాప మాత్రిపాఠి యేమియు ననలేక లోగుట్టు తెలిసెఁగదా యని సిగ్గుపడి యింటికింబోయెను ఆనాటినుండి వారిరువురకు మనస్సులు కలిసియుండవయ్యెను.

జానకీబాయి ఆనాఁడుమొదలు తఱచుగా సాయంకాలము పూర్ణాంబయింటికి రాకయుండెను. ఏమమ్మా యని యడిగిన నాకాలమున సంగీతము సాధించుచున్నాను. నాకు సంతోషకాల మదియే కదా. అపుడపుడు వచ్చుచుందునని

బదులు చెప్పెను. ప్రాతఃకాలమో యెపుడో వచ్చుచునే యుండెను. ఎప్పుడైన నొకప్పుడు కృష్ణాకుమారి యింటికివచ్చుచుండు సీతాపతిగోస్వామి యానాటినుండి రాకుండెను. ఎవరో యొకరు వచ్చుచుందురు. ఆతఁడు రాకున్న నేమియని కృష్ణాకుమారి విచారపడకయుండెను. పద్మావతి మాత్రము సాయంకాలము తప్పించి యెపుడో ప్రతిగిన మొకసారి జానకీబాయిని జూచి వచ్చుచుండెను. మంగళాంబ కృష్ణాకుమారియు నెప్పుడైన నొకప్పు డామె యింటికిం బోవుచుండువారు.

పూర్ణాంబ యొకనాఁ డాలోచించి యందఱు రావలయునని కోరెను. మధ్యాహ్నము నిద్రపోయిన మానెనని యందఱు ఆమెయింటఁ జేరిరి. పూర్ణాంబ కొంతసేపు ముచ్చట సాగించి యిట్లు పలికెను. అక్కలారా! ఇది కలియుగము. సత్యమునకు కాలము లేదు. స్త్రీలు అబలలని మగవారు తూలనాడుదురు. వారినోళ్లు మూయించవలయును. మన మొకసంఘముగా చేరి యపుడపుడు సభలు జరపి మనభావములను ప్రభువులకుఁ దెలుపవలయును. లేకున్న నీనగరములో మనకేమి పేరుండును? చూడుఁడు. ప్రయాగక్షేత్రమునం దబలలు సభలుచేసి మగవారిని గడగడలాడించిరఁట. నిన్న మొన్న నే శ్రీనగరమున స్త్రీలు మగవారు నొకవిషయమునఁ బందెము వేసికొనఁగాఁ దుదకు మగవారు వగర్చుచు లేచి పోవఁగా స్త్రీలే పైకి లేచిరఁట. ఇన్ని తావుల నిట్లు స్త్రీలు తమశక్తిని ప్రదర్శించుచుండ నీనగరమున మనమేల యూరకుండవలయును? వారికన్న మన మేవిషయమునఁ దక్కువ? పూన లేదుగాని యే కార్యమునకు మనము ముందు నిలువఁబడినను మగవా రోడిపోవు

మును. కావున మన మొకసంఘము నేర్పఱచినఁగాని మనశక్తిని లోకులకుఁ దెలుపఁజాలము. మీ భావము లేమని ప్రశ్నించుచుఁ దనయుపన్యాసమును ముగించెను. వచ్చినవారందఱు నేకగ్రీవముగా నంగీకరించిరి. కార్యనిర్వాహకవర్గమునం దీక్రింది వారు నిర్ణయింపఁబడిరి పూర్ణాంబ, పద్మావతి, మంగళాంబ, జానకీబాయి, కృష్ణాకుమారి, పార్వతీబాయి, శకుంతలాదేవి అనునారీమణులు. నాఁటికి సభ ముగిసెను.

జానకీబాయికి పద్మావతికి నానాఁటికి స్నేహము వర్ధిల్లుచుండెను. మంగళాంబకు కృష్ణాకుమారికి సఖ్యె కుదిరెను. వీరందఱు పూర్ణాంబయందు మైత్రి కనంబడఁజేయుచుండిరి. ఇంటిపనులకంటె నీసంఘకార్యమే యెక్కుడుగా వారు తలంచిరి. ప్రతిదినము జానకీబాయి రాఁజాలమి నపుడపుడు మధ్యాహ్నమున వచ్చుచుఁ గనఁబడినవారితో మాటలాడుచుఁ బోవుచుండెను. ప్రియంవద పద్మావతికి నేవేవో రహస్యలేఖములను జానకీబాయి వ్రాసినవానిం దెచ్చి యిచ్చుచుండెను. క్రమక్రమముగా నీయిరువురుతోఁటి సంబంధము ప్రియంవదకు హెచ్చుచుండెను. పద్మావతి కొకపుత్రికయుఁ బుత్త్రుఁడు కలిగిరనువిషయ మీవఱ కెఱుఁగకున్న నిపుడు పాఠకు లెఱుంగందగును. ఈకథ జరగునప్పటికి కుమారిక కెనిమిదేండ్లు కుమారున కయిదువత్సరములు వయస్సుండెను. ఇంచుక యిందు భేద ముండవచ్చును.

కుమారస్వామి యించుక ధనమార్జించి దాఁచిపెట్టక యేవో నాలుగాభరణములు పద్మావతికిఁ జేయించెను. కాని రానురాను జానకీబాయి స్నేహము వృద్ధికాఁజొచ్చెను. దిన

మున కొక్కసారియైన నొకరినొకరు చూడకయున్న బ్రదుకఁ జాలుదుమా యన్నంతదనుక నాస్నేహము పెరిగెను. అది పెరిగినకొలఁది పతియగు కుమారస్వామిపై ననురాగము తఱుగసాగెను. యశోదమ్మ కోడ లెన్నిచీవాట్లు పెట్టుచున్నను నలుగురియెదుట నేమన్నను దలవంచుకొని కొడు కంబేద యయ్యెఁ గదా యని వగచుచు నూరక కాలముఁ గడపుచుండెను. కుమారస్వామియు భార్య నేమనఁజాలక యేమన్నను బండువంటికాపురము పాడగునే యని చింతించుచుఁ బద్మావతి రాత్రి యెంతదనుక రాకున్నను వెదకఁబోవక వచ్చిన తరువాత నాక్షేపింపక చూచి చూడనట్లుండ నేర్చుకొనెను. మంచిచీరలు అవికెలు మాత్రము తెచ్చియిచ్చుటలో నసూయను జూపక జాగ్రత్తగా సంసారయాత్ర సాగించుచుండెను. పద్మావతియక్క గ్రామాంతరమున నున్నదికాన సంతానము లేదనుకొఱఁత పోవఁ జెల్లెలికూఁతురిని బిలుచుకొని పోయి పెంచుచుండెను. బావ అపుడపుడు శైలపురమునకు వచ్చుచుఁ బద్మావతిం జూచి మాట్లాడుచు రెండుపూటలుండి తృప్తిదీఱ నామెతోటి కాలము పుచ్చి పోవుచుండువాఁడు. తోడియల్లుఁడింటికి రాఁగాఁ గుమారస్వామి యేదో యొక కారణమును గల్పించుకొని యెందో కాలమును బుచ్చుచు నాతనిం గాంచినపు డాదరించుచు రహస్యముగా మాటలాడుచు నసూయ తనకున్నట్లు తోఁపనీయక వర్తించుచుండెను. కుమారస్వామి రాలేదే ఏమని యతఁ డనుకొనక తనవచ్చినపని కాఁగానే పోవుచుండువాఁడు. పద్మావతికి మగనికి మనస్పర్థలు గలిగి పెరుగుచున్న వన్నమాట నలుగురికి నెట్లో తెలిసెను. మగని

నాక్షేపించువారు పద్మావతిని బ్రేమించువారుగ నుండిరి. పద్మావతిని జాటున దూషించువా రనేకులుగ నుండిరి. మొగము ముందిది బాగున్నదా యనువా రొక్కరైన లేక పోయిరి. ఏమన్న నొకమాట యన్న నామె పదిమాట లనుననియుఁ దమ యందుఁగల లోపములు బయటపెట్టుననియు వారూరకుండుటకుఁ గారణములై యుండవచ్చును.

పురుషోత్తమదాసు ప్రియంవదమూలమునఁ బద్మావతి గుణవిశేషములఁ దెలిసికొనుచుండువాఁడు. కాని రెండు మూఁడుసారులు ప్రయత్నించినను ఫలము గాంచక మొగము చిన్నఁబుచ్చుకొని గుటకలు మ్రింగుచుండువాఁడు. జానకీబాయితో నామెకు స్నేహ మధికమైనదన్నమాట విన్న తర్వాత నొకనాఁడు తనయింటనుండి తనమేలు గోరుచున్న ప్రియంవదతో నింతవిశ్వాసము నాయందు నీకుఁ గల్గియు లాభము నాకుఁ గలిగింపఁజాలకపోతివికదా. ఇప్పుడైనఁ బద్మావతిని లోఁబఱుపరాదా యని మందలించెను. ప్రియంవద సమయానుకూలముగా మాటలాడు నేర్పుగలది. కావున దాసుతో నయ్యా! ఎన్నియో మాయోపాయములు పన్నితిని. ఆమె లొంగలేదు. జానకీబాయితోఁ జెప్పించితిని. ఆమెతో నీవలెనే నన్ను భావింపరాదా. అనెనఁట. సమాన వయస్సు గోరుచున్నదఁట-ఈమాట నిన్ననే నాతో జానకీబాయి చెప్పినది. కాని నూరకున్నాను. ఈకాలమిట్లే యుండదు. యశోదమ్మ యింక నుండఁజాలదు. పెద్దకుమారునికడకుఁ బోవును. కుమారస్వామి యింటిలో గడియసేపైన నుండఁడు. పెండ్లాముపై నంతప్రీతి లేనివాఁడయ్యెను. కనుక నాశక్తి

కొంఁది ప్రయత్నించి నీకనుకూలముగ వర్తించునట్లు చేసెదనని నచ్చఁజెప్పెను. అంతతో మానక యిపుడున్న వారు చాలరా యని నాతో నొకసారి యన్నది. కావున మీరు క్రమముగా వీరిని వదలుకొని యామెనే నమ్మియున్న సమ్మతించునట్లు నాకుఁ దనభావమును దెలిపినది. కొంచెము కాలము సాగినపిదపఁగాని సాధ్యపడదు. సాధించిగాని వదలను. నమ్మవలయునని బీరములు పలికి దాసు నూఱడించెను. ఏమిసేయుదు దైవమా యని దాసూరకుండెను.

భుజంగద్వివేది దాసుప్రియమిత్రుఁడని చదివితిరిగదా. ఆతఁడు సార్థకనామధేయుఁడు. ఇరువురుకుమారులు గలరు. సత్కుటుంబమునకుఁ జేరినవాఁడేయైనను జపలచిత్తుఁడు. చపలచిత్తులకు తఱచుగా మంచిసెబ్బరలు తెలియవు. గోస్వామివలెనే జానకీబాయియింటి కపుడు పోవఁ బ్రయత్నించుచుండెను. కాని యామె యేటికో కాని యితని గారవింపకపోయెనఁట. అది యొకకోపకారణము కాక విచారకారణముగఁ బరిణమించెను. కావున నేమియుఁ దోఁపక తిరుగుచుండువాఁడు. భార్య పతివ్రత. కావున నతని నేమియు దండింపక ఉన్నంతలో సంసారము జరపుచు కొడుకులను జూచుకొని తృప్తిపడియుండెను. దాసు చిరకాలముగా మిత్రుఁడుగానున్న భుజంగద్వివేది యేయుద్యోగము లేక యుండుటకు చింతించి చదువుకొనినవాఁడని కరుణించి యేదో యుద్యోగ మిప్పించెను. దానినైన చక్కఁగాఁ జేయక యిష్టమువచ్చినట్లు తిరుగుచుండెను. నగరములోని వార్తలెల్లను గొనివచ్చి దాసునకుం దెల్పుచుఁ గాలము సంతోషముగా సాగఁజేయుటకుమాత్రము

తోఁడుపడుచుండెను. అవియు నాదాసున కావిచారకాలమున మంచిదనియే తోఁచెను. దాసున కాకాలమున నేప్రయత్నము చేసిన ఫలింపకుండెను. పూర్ణాంబ యేర్పఱచిన సంఘములోని వారికెల్ల ప్రియంవదపంక సంధి నడిపినవాఁడే కాని ఫలము శూన్యమయ్యెను. కావున నిది దుష్టగ్రహచారమని దాని నను భవింపవలసినదే యని నమ్మి యేప్రయత్నముచేయక గోళ్లుగిల్లు కొనుచు నూరకుండెను. నగరములో మాత్ర మతనివృత్తి మంచిది కాదని తలంచువారేకాని మంచి నెంచువారు లేరు. అయినను మొగము చూచినపుడు మరియాదను జూపుచుండు వారు. తనగుట్టు కనిపెట్ట నెవరికిఁ దరముగాదనియు సర్వమును మోసపుచ్చఁగలననియు నతఁడు తలంచుకొనుచుండువాఁడు. పదుగురిలో నేడిపైనను డాగదని యాతఁ డెఱుఁగఁడనియుఁ జదువుకొనినను మూర్ఖులపట్టికలోఁ జేరఁదగినవాఁడనియు నూహింపవచ్చుఁగదా! ఒకనాఁడు నారాయణమూర్తి త్రిపాఠి కనఁబడఁగా భుజంగద్వివేది యాతని మాటలాడింపఁబూని యేదో యుపకారము చేయువానివలె నయ్యాయూరకున్నారా ఏదోయొకపని చేయుచున్నారా యని యడిగెను. విశేషలోక జ్ఞానము తనకున్నయట్లు భావించువాఁడుగాన నాత్రిపాఠి యతనితో నూరకున్న నెట్లు కాలము గడచును? ఏదో యొక పనిమీఁద నున్నానని కట్టుకొన్న పంచెను సవరించుకొనెను. అది యెఱింగి భుజంగద్వివేది తమకు సంసారబాధ యంతగా లేదనుకొందును. అనఁగానే త్రిపాఠి మొగము చిన్నపుచ్చు కొనెను. ఆవిషయ మెఱుఁగనట్లు నటింపఁగోరి ద్వివేది సంసార బాధయున్న నావలెనే యుందురు. మీరు నెమ్మదిగా నున్నట్లు

మీ మొగమే చెప్పుచున్నదనెను. నాగుట్టు వీఁడు కనుఁగొనలేదనుకొనుచు మీకు చక్కనియాశ్రయ మున్నది. కాన మీరే హాయిగా నున్నారని నేననుకొనుచున్నానే యనెను. మీకంటె. కొంచెము ఎక్కువగా బాధ యున్నది. నాకున్న యాస్తి తమకున్నంతదిమాత్రము గాదని నవ్వెను. ఇరువురు సైఁగకు సైఁగగా మెల్లగా తమదారినఁ బోయిరి. అదిమొదలు భుజంగద్వివేది మంగళాంబపై కన్నువైచెను. కాని యామె యతనిస్థితిగతుల నెఱిఁగినదిగాన నెంతమాత్ర మంగీకరింపక పోయెను. గురుశిష్యుల కిరువురకు నొక్కరీతిగనే పరాభవ మర్యాద కలిగెను. క్రమముగా దాసు ద్వివేది యనువారిపై పెక్కండ్రకు విశ్వాసము తగ్గెను. మళయాళమనఁగానే యించుక పరిహాసమునకుఁ బాత్రమయ్యెను నందనారామవీథి దీనికంటె నగ్రస్థానము వహింపఁజాలెను. తక్కినవీథులకంటె నీవీథియందు మిటారులనీటు మెండయ్యెను. దీనికి రెండవదిగా మళయాళవీథి పేరువహించెను. ఈమిటారులజోలికిఁ బోయిన నేమిచిక్కులు వచ్చునో యని యందఱు చాటుగా నేమనుకొన్నను వారిమొగముముందు మర్యాదగా వర్తింపసాగిరనక తప్పదు.

# ఆఱవకళ

కుమారస్వామి పరమపదించుట, కృష్ణాకుమారి పద్మావతికి సాయపడుట.
ఆమె కొన్నికష్టములకు పాత్రురాలగుట. దాసు పద్మావతికికి తోడుపడుట.
జానకీబాయి నాట్యకళ వృద్ధినొందింపఁబూనుట.
పలువు రామెకు సాయపడుట.

కుమారస్వామి కుదురుగా సంసారయాత్ర సాగించుచుండెను. కాని భార్యామూలమునఁ గొన్నిరోగములు రాఁగా అస్వస్థుఁడయ్యెను. మందులతని కాహారములయ్యెను. క్రమక్రమముగా నాతఁడు మంచము పట్టెను. తల్లి యెన్నియో యుపచారములు చేయుచుండెను. ఈపీథియం దిల్లు సంపాదించితినే యనుభీతి యాతని బాధింపసాగెను. అతీతకార్యమునకు విచారింపఁడ లాభమేమి? కన్నకూఁతురును వారు పంపక పోయిరి. కొడుకు చిన్నవాఁడు పద్మావతి పూర్వమురీతిగా సంచరింపసాగెనుగాని పతి కుపచారము చేయఁబూనినది కాదు. తిరుగఁజాలక కృశించి కృశించి తుదకు నాకుమారస్వామి యసువుల నాయింటికి బలియియ్యవలసినవాఁడయ్యెను. ఆదినములు వెళ్లగనే యశోదమ్మ దూరమందున్న పెద్దకుమారుని కడకుఁ బోయెను. పద్మావతిమేనయత్త ఆసంవత్సరమం దుండెను. పగలు తిరిగిన బాగుండదని పద్మావతి చీకటిపడినతరువాత నెచ్చెలులయిండ్లకుఁ బోవుచుండును. గడువుముగియఁగా పూర్వమువలె నందఱియిండ్లకు రాసాగెను. ఆమేనత్త తన

యింటికిఁ బోయెను. కుమారునితోడ నాదేవి సువాసినీవేషము ననే యుండెను. అపుడపుడు బావ వచ్చి విచారించి పోవు చుండెను.

కృష్ణాకుమారిచరిత మించుక తెలియఁదగి యుండును. ఆమె యాదేశమున నుండుజాతులలో నొకయుత్తమజాతికిఁ జేరినది తల్లిదండ్రులకీమెయే జ్యేష్ఠపుత్రిక. తమ్ముఁడొకఁడు చెల్లెలు కలరు. తండ్రి గతించెను. తల్లి యెట్లో శ్రమించి యీపిల్లలను బోషించెను. ధనము లేనందున నలుగురిని మంచి మాటాడుకొని పిల్లలను బోషించెను ఏనుగంత తండ్రికంటె నేనుఁబుట్టింత తల్లి మేలన్నసామెత న్యాయసమ్మతమే కదా. జ్యేష్ఠపుత్రికకు చదువు చెప్పించెను. సంగీతమునఁ బరిచయము గలిగించెను. జానకీబాయిమూలమున నృత్య మభ్యసించెను. మాళవదేశమున నృత్యము ప్రధానవిద్య యని చెప్పుదురు. తఱచుగా స్త్రీలు పదాఱువత్సరములు నిండువఱకు నృత్యము నేర్చుకొందురు. తర్వాతఁ గూడ దాని నభ్యసించుట తప్పు గాక యన్నిజాతులయందది గౌరవమునే గాంచును. ఈసంఘమునం దీయిరువురే నృత్యకళను నేర్చినవారు.

కృష్ణాకుమారి నవలావణ్యవతి. గుండుమొగము, తామరరేకులవంటికన్నులు, వానికి నీడుజోడుగా నుండుచెవులు ననునివి సుందరాంగి యని తెలుపుచుండును. నిగనిగలాడు దేహకాంతి ముద్దుగా నుండును పలువరుస యొక్కటియే చాలునని కొందఱందురు. దాడిమీబీజములవంటి దంతములు వర్ణింపఁదగినవియే. కావున నామెయు నందగత్తెలలో నొకతె యని యావీథియందుఁ బేరుగాంచినది. సౌందర్యమే ముఖ్య

మని భావించినవారికిఁ గృష్ణాకుమారి నచ్చుదేమో యన వచ్చును సౌందర్యముమాట యటుండనిత్తము. ఎట్టివానిని గాని లోఁబఱచుకొనుమాటలనీ టామిటూరికి మెండు ఒక్క సారినవ్వినా యౌవనముగలవాఁడు మాటలాడక దాఁటిపోలేఁ డనక తప్పదు. చూపులు మారునితూపులే కాని వేఱు కావని యచ్చట కవీశ్వరులు సిద్ధాంతము చేసిరి. ఈమెకు మంగళాం బకు మైత్రి మిక్కుటముగా నుండెను. ఈమెకుఁ దెలియ కుండ మంగళాంబ మంచినీరు త్రాగదనవచ్చునేమో.

కృష్ణాకుమారి పద్మావతికిఁ గల్గిన విపత్తునకు వగచి విచా రింపఁబోయెను. పద్మావతి మూఁడునెలలకు మించియుండెను. ఆనాఁడు కృష్ణాకుమారిని జూడఁగనే యెచ్చటికో పోవ నలంక రించుకొనుచున్న పద్మావతి కూలఁబడి వగవసాగెను. కృష్ణా కుమారి చాల సూక్ష్మబుద్ధిగలది కాన నామెకు వ్యసనమే లేదని తెలిసికొని మెల్లఁగా మాటలాడఁబూనెను. చిన్నతనముననే యీయవస్థ వచ్చినదని విని కళకళలాడు నీమొగము చూచుచుండిననే నీసమయమున నెట్లుండునో యని చూడఁ జాలక యిన్ని దినములు రానైతిని. మీయింటి యాచారముల ప్రకారము విధవచిహ్నములు గనిపించునేమో యని భయ పడితిని. అదృష్టవశమున నవిమాత్రము లేకున్నవి. తలగొరి గించు నీపాడుపద్ధతి యేల పెట్టిరో తెలియదు. నీవందులకు సిద్ధ పడితివఁట. మీఅక్క బావ వలదన్నందునఁ దలవెండ్రుకలు నిలిచినవని విని వచ్చితిని. చాలమంచిపని యిది. సర్వాసహ్య ముగా నుండువేషమేల? శిరోజము లేమిపాపము చేసినవి? వానిమూలమున చెడిపోవుదురా? అవి లేనివారు బాగు

న్నారా? ఈవిషయమునఁ బ్రాఁతయాచారములందుఁ గొన్నిం టిపైన నాకిష్టము లేదు. అమ్మా! ఏది యెట్లున్నను నీకేమో కొన్నికష్టములు కలిగినవి. కుమారిని అక్క పెంచుకొన్నను కుమారుని బోషించుభారము నీతలపైఁబడినది. పదికాలముల పాటు పతి యుండిన నెంతయో బాగుండును. ధనము చేర్చి పెట్టినవాఁడు కాదనికూడ వింటిని. అమాయికుఁడు. తృప్తి పడువాఁడు కాని కావలయునని అడుగువాఁడే కాఁడు. కుమార స్వామి యనఁగా దేవునివంటివాఁడని నానమ్మకము. అమ్మా! ఋణబాధ లేదుకదా. ఉన్నభూషణములను వారిచేతికి వీరి చేతికి నిచ్చిపాడుచేయక పెట్టుకొనుచుండుము.ఒకరికిచ్చిన మరల నీకేల విధవ కందురు. కాలము మంచిదికాదు. ఇఁక నీవార్జించి కదా కొడుకును బోషింపవలయును. ఏమియుఁ దెలియని దానవు. ఎట్లు సంపాదించి కొడుకును వృద్ధిచేయుదువో తెలియ రాకున్నది. ఈశ్వరుని నమ్మి యేదో యొకరీతిగా పిల్లవానిని బోషింపవలయుఁగదా. నలుగురిని మంచిమాటలాడుకొని దేహ ములో కండలున్నపుడే యేదో యొకరీతిగా నాలుగు డబ్బు లార్జించి కూడఁబెట్టి కొడుకును బాగుచేయుము. అని పలి కెను.

కృష్ణాకుమారిమాట లన్నియుఁ దనపైఁగల జాలి చేతనే చెప్పఁబడినవనుకొని గ్రహాచారము చాలదు. మీవంటి వారిదయయున్న నెట్లో జీవింతును. పుట్టించినవాఁడు పూరిమే పునా? నన్ను మీరు మఱువకయున్నఁజాలును. అని నవ్వుచునే యేమో మాటలాడఁబోయెను. ఆమెయూహాలు తెలిసికొని అమ్మా! అల్లులను దగ్గర చేర్పకుము. గొప్పవారితో మాట

లాడిన లాభము లేకున్నను మంచిదే. అల్పులమూలమున లాభముగల్గినను మర్యాదకాదు. ఆలోచించి తగినవారితో స్నేహము చేసి తనసొమ్ము పోనీయక యేదో యొకరీతిగా పదిడబ్బులు చేర్చవలయును. నాశక్తి నీవెఱుంగనిది కాదు గదా. యథాశక్తి తోడుపడుదును. అని మెల్లగా మాటలసందడిలోఁ దన మనస్సులో నున్న భావముం దెలిపి నాటికి వెడలిపోయెను

పద్మావతి తనగుట్టు కృష్ణాకుమారికి తెలియదనియుఁ దన నుగుఱించి మంచిభావము కలదనియుఁ దలఁచెను. ఆనాఁడు కృష్ణాకుమారివచ్చినది దానునం దామెకు మంచియభిప్రాయము కలిగించుటకే యని చదువరు లూహింపఁగలరు. తనకు జానకీ బాయికి స్నేహముకుదురుటయు, ప్రియంవద తనగుట్టు మఱి యెవరికిఁ దెలుపనీయక కాపాడుననియు నామె తలంచెను. తనతో మాటలాడినట్లే యాదాసి యందఱితో మాటలాడి యుండునని తలంచియుండవలసినది. అట్లూహింపక తనకే యది నెచ్చలి యనియుఁ దనసంచార మెవరికిఁ దెలియదనియుఁ బద్మావతి తలంచుట యవివేకమువలననే యని పఠించువారు తెలిసికొనకపోరు. ఇంటికింబోయిన కృష్ణాకుమారి ప్రియంవదమూలముననే దానునకు నాశగలుగువార్తం బంపి యపుడపుడు పద్మావతికడకుం బోవుచు మాటలాడుచు నేదో నెపమున దాను యోగ్యుఁడనియు రసికుఁడనియు ధనవంతుఁడనియు స్నేహపాత్రుఁడనియు నెందఱో చెప్పఁగాఁ దాను వింటిననియుఁ జెప్పుచు వచ్చుచునుండెను. ఆమాటల వినునపు డామె యనాదరము చూపకుండుటయు నాకృష్ణాకుమారి కనిపెట్టి రొట్టె

విఱిగి నేతిలోఁ బడుచున్నదని మనస్సున సంతోషించుచుండెను.

పద్మావతికి పతివియోగము సంభవించిన యొకసంవత్సరమునకు సంతానము కల్గుగుఱుతులు కనఁబడియెను. ఆవార్త రెండుమూఁడు నెలలకు నల్వురిచెవుల కెక్కెను. ఆసమయమున నామెతల్లి వచ్చియుండినది. ఆమె పతివియోగమున దుఃఖపడుచుండునది యేమైనను గన్నకూఁతురగాన నాపడయందుఁ దోడుపడ వచ్చియుండెను ఈవార్త యామె యెఱుంగదు. ఎవరో కపంత చెవికెక్కించిరి. కొమార్తె నడిగి కడుపు చూచి యేమియు ననఁజాలక యేదో యొకమాట చెప్పక యున్న మానహానియని తలంచి మూఁడుసారులు తొమ్మిది నెలలు కావలెను. ఇదియే మూఁడవతడవ సాగుచున్నది. తొలుచూలు నిల్లే యైనది. మేము చాల భయపడితిమి. తుద కెట్లో యీశ్వరానుగ్రహమున సుఖప్రసవ మైనది. ఈసారి కూడ నాచాలే వచ్చినదని మాట సర్దుబాటుచేసెను. ఈసంవత్సరము దాఁటినది కదా. ఒక్కసారికూడ నీమాట యనఁగా వినలేదే యని యొకయింటియామె హెచ్చరించెను. ప్రతిసారి చెప్పకొన్న నగుబాటనియు నీదుఃఖములో మునిఁగియుండుటయు నెవరికిఁ జెప్పకుండుటకుఁ గారణంబులని సమాధానము తల్లి చెప్పచునే నిందులకే వచ్చితి ననియెను. ఈసమాధానము చెప్పుటకాయని యామె మరల నడిగెను. ఆమాట విననియట్లు నటించి యేదో పనిమీఁద నచ్చుటినుండి తొలఁగెను. వరుసఁగా నాగర్భము వృద్ధియయ్యెను. అక్కయు బావయు

సత్తఁటి నచ్చుటికి రాకయుండిరి. తల్లి పతివ్రత. కావున నేమియు ననలేక అనుభవింపలేక కృశించుచుండెను.

శైలపురమున నొకజ్ఞాని యుండెను. బ్రాహ్మణజాతికిం జేరినవాఁడు. ఆదేశస్థుఁడు కాఁడు. సంసారము భరింపలేక ముగ్గురు కుమారులతో నాపురికివచ్చి సంసారయాత్ర సాగించుచుండెను గృహిణి శీలముగలది. ఆజ్ఞానిపేరు నాగశైలద్వివేది. ఆతనికడకుంబోయి పద్మావతితల్లి రహస్యముగా నీవార్త నెఱింగించి యెట్లో గాపాడవలయునని బతిమాలెను. భుజంగద్వివేది కితఁడు బంధువు. కనుక నతఁడుకూడ నీయవమానము నెట్లో తొలఁగించి యీకాపురమును నిలిపి పుణ్యము కట్టుకొనవలయునని తెలిపెను. నాగశైలద్వివేది భూతదయగలవాఁడు కాన నిది నలువురకుఁ దెలిసిన కులహాని యగుననియు నూరకున్న నామె యాత్మహత్య చేసికొనుననియుఁ దలంచి చెవియొగ్గెను. పద్మావతితల్లి మహానుభావా! రెండేండ్లనుండి యున్న దీగర్భము. ఇపుడు దుష్టులు తప్పుమోపి నలుగురిలోఁ దలవంపులు చేయవలయునని యిట్టి యపవాదము మాపిల్లపైన వైచిరి. సత్యము చెప్పుచున్నాను. మీరే తల్లిదండ్రులు పుత్రిక యనుకొని కాపాడవలయునని కాళ్లపైఁ బడెను. ఆమాటలను నమ్మి బంధువగు భుజంగద్వివేదికూడఁ దెలిపినందున నిది సత్యముగనే యుండునని విశ్వసించి అమ్మా మరల నామె యీయూరికి రాఁగూడదు. అట్లైన సాయమొనర్చెదనని ప్రమాణము చేయించి యాశైలపురమున కొకమూల ముప్పదికోసులదూరముననున్న మహానగరమునకుఁ బిలుచుకొని పోయి యందొకచోట నిల్లు చూపించి యిందుండి ప్రసవా

నంతర మాశిశువు నెవరికైన నిచ్చి మీపుట్టినింటికిఁ బోయి సుఖముగా బుద్ధిగలదానవై కాలము గడపవలసినదని హితము బోధించి మరల శైలపురమునకుఁ బోయెను. కొలఁదిదినములకే పద్మావతి యొకశిశువుం గని యదృష్టవశమున నాశిశువు మృతినొందఁగా నందుంచక పుట్టినింటికిం బోవక శైలపురికి నించుకదూరమందున్న తోడఁబుట్టువునింటికిఁ బోయి బావ కడ నిష్టకథాలాపములఁ గాలము పుచ్చుచుండెను. కారకుఁ డగు భుజంగద్వివేదికిఁగాక నాగశైలద్వివేదికి నీయపకీర్తి లభించెను. ఈశ్వరుని నమ్మి దోషమున్న నాకనుభవమునకు రాక మానదని లేక నిష్కారణముగా నన్నుచో దానిఫలము ననుభవింతురని యూరకుండెను. ఏమియు నెఱుఁగనట్లు భుజంగద్వివేది నెమ్మదిగా నుండెను. మఱియాశవీధియందు విజ్ఞులగువార లిది భుజంగద్వివేది పనియే యనియు ఊరక యావెఱ్ఱిబాపఁడు నెత్తిన వేసికొన్నాఁ డనియు భావించి యతని దూషింపక యుండిరి.

కొలఁదినెల లక్కయింట నుండి పద్మావతి మరల శైలపురమునకు వచ్చి నాగశైలద్వివేదిని దూషించుచు భుజంగద్వివేదితో యథాపూర్వముగా మాటలాడుచు నుండెను. ఉపకారముచేసి చీవాట్లు తినవలసివచ్చెఁ గదా యని యానాగశైలద్వివేది చింతించుచు మరల నామె పిలిచినను బలుకక తన వృత్తియందుండెను. గ్రామాంతరముననున్న యామెయక్కయాకుమార్తెకు వివాహముచేసి కొలఁదికాలమునకే పద్మావతికిఁ దోడయ్యెను. కాని మగనిని చెల్లెలు లోఁబఱచుకొని తనపై నతనికిఁ బ్రీతిలేకుండఁ జేసెనన్నకోపమున నీమెకడకు

రాక తనబంధు వెవఁడో యుండ నందుండెను. ఆమెతల్లియుఁ దనయింటికిఁ బోయి యెట్లో కాలమును బుచ్చుచుండెను. తల్లియు నక్కయుఁ దన్ను వదలఁగా మగనితల్లి యానాఁడే పెద్దకొడుకు దగ్గఱకుఁబోవఁగా కోడలును బోషించుచుఁ దన యింటిలోనుండి ప్రియంవద చెలికత్తె కాఁగా జానకీబాయి స్నేహము పూటపూటకు మఱింత దృఢము కాఁగాఁ గృష్ణా కుమారి యపుడపుడు తన్నుఁ జూడవచ్చుచుఁ దనయింటికిం బిలిపించుకొనుచు మాటలాడుచుండఁగా నెవ్వానిని లెక్క చేయక హాయిగా నుండెను. మంగళశుక్రవారముల నభ్యంగ స్నానముచేయుచు రెండుగంటలు సైచుకొని తిరుగుచుండెను.

పెద్దలు అందఱికంటె బాగుగా నీపద్మావతి యెట్లు కాలము పుచ్చుచున్నదని యనుకొనుచు నామెను చాటున దూషించుచు మొగమునం జేమియు ననక యెక్కడమాట యన్న నూఱుమాటలు పెట్టునే యని భయపడుచు నూరకుండిరి. పరిమళతైలములు సింగారమునకు పుట్టినిల్లుగా నుండు మంచిచీరలు అవికలు కొదువలేకయుండఁగా నామెకుఁ దిగులేల కలుగును? ఆఱేండ్లు కొడుకునకు నిండవచ్చెను. తలవెండ్రుకలు తీయించుకొన్న పితృకార్యములకు వంటచేయఁ దోడ్పడుదువు కదా యని బంధువులన్నను విననట్లుండ నేర్చుకొనెను. ఇఁక దీని నేమన్నను బాగుండదని వారూరకుండిరి. "భయము లేకున్న దేహము బలియును" అన్నసామెత సార్థకమేకదా యనునట్లు పద్మావతి దృఢశరీరయై రూపవతియే యనఁదగియుండెను.

తల్లి తనయింటికిఁ బోవుటయుఁ దా నొంటరిగా నుండు టయు కుమారుఁడు బాలుఁడగుటయు సుమారుగా సొగసు కత్తె యనిపించుకొను కోరికలుగల్గుటయు నావీథికి మళయాళి మని పేరుగల్గుటయు నందుఁ బెక్కండ్రు జవరాండ్రు స్నేహము తనతోఁ జేయుటయు నీమొదలగు కారణములచేత పద్మావతి యిపుడే సుఖపడుచు ధనము నార్జింపవలయు ననుపట్టుదల కల దయ్యెను. కృష్ణాకుమారి యందులకుఁ దోడుపడుచునే యుండెను. జానకీబాయి సావాసము ముఖ్యముగా నీయాశ కల్పించెను. పూర్ణాంబయు మంగళాంబయు నీమెకు మిక్కిలి కావలసినవారుగాక సాధారణస్నేహముగలవారుగా నున్నం దున వారితో నీప్రస్తావనలు చేయక వారికిఁ దగినట్లు మాట లాడుచు వారిస్నేహమునకు భంగము కలిగింపక మెలఁగుచు నుండెను. బావ గతించుట అక్క యీమెయందు మంచి భావము కలది గాకుండుటయు పద్మావతికి భయము లేకుండఁ జేయఁజాలెను. కొలఁదిదినము లిట్లు సాగగా చేతనున్న నాలుగు డబ్బులు ముగియవచ్చెను. ఇట్టి కర్చులకు ధనము కావలసి వచ్చెను. వలసినట్లు వస్తువులు కొనుటకుఁ దగినంత ఆర్జింప వలయు ననునభిప్రాయము గట్టిపడెను.

ప్రియంవద యీవిషయము లన్నియుఁ గనిపెట్టు చున్నదే కాన నొకనాఁడు పద్మావతితో మాటలాడుచు నమ్మా! యీనగరమున నాకంటె నీకుఁ గావలసినవారు లేరు కదా. నాప్రాణమే నీప్రాణము నీప్రాణమే నాప్రాణముకదా. నామాట వినకపోవని నమ్మి యొకమాట చెప్పెదను. దేవునితోడుగా నెవ్వరికిని జెప్పనని యొట్టుపెట్టుకొన్న చెప్పెదను. లేకున్న

వెళ్లిపోదును. అనఁగా పద్మావతి కొడుకుపై బట్టుపెట్టుకొని చేతిలో చేయివేసి బాసచేయగా నమ్మినట్లు నటించి యిట్లు చెప్పెను. తల్లీ! నిన్ను చూచినవారెల్ల ముద్దుగుమ్మ యను చున్నారు. ఈనాలుగునాళ్లు దాటిన మాటలాడించువా రెవ్వరు? కొడుకా పెరుగుచున్నాఁడు. నీకును దాదాపు ఇరు వదాతేండ్లు దాఁటవచ్చినవి. ఇఁక పదియేండ్లకంటె వయస్సుం డదు. నాలుగుడబ్బు లార్జించుకొను నుపాయము చూచుకొన వలదా. ఊరకున్న ముందు గతియేమి? తక్కువగా లెక్కించి నను వాసననూనెలు నలుగుపిండ్లు పట్టుఅవికలు చీరలు ముఖము నకు క్రొత్తరకముపొడి, అనువానికే పదిరూపాయలు కావలయు గదా ఫలాహారములకు ఎనిమిదిరూపాయలైన కావలదా. రెండుపూటలు నేతితోనే చేయవలయుఁ గదా. చిన్నతనమునుండి రుచిగా తిన్నదానవు. ఇపుడు కష్టాన్నములు తినలేవు కదా. మొన్న నేను కుట్టించితెచ్చిన పావడకే ఆఱు రూపాయ లయ్యెగదా. ఇన్నియు నీకు కావలసియే యున్నవి కదా. ఇట్టి నీముద్దుముచ్చట్లు చూచువా రుండవలదా. ఒక నియమము లేకున్న నెన్నియోకష్టములు వచ్చునని నీకు మాత్రము తెలియదా. కనుక నామాటవిన్న సుఖపడుదువు. చెప్పమందువా? అనఁగా చెప్పవే యిందు కింతయాలస్యము చేసెదవే యని చెంప గిల్లెను. ఇంక దొరకినదిలే యీపిల్ల అను కొని యిట్లు చెప్పెను. అమ్మా! ఇదివరకే నాలుగైదుసంవత్సర ములనుండి దాసుగారికి నీయం దభిలాషము గలదని చెప్పుచు వచ్చితిని. చిమ్ముకొని పోయితివి. ఇపు డెవ్వరులేక యొక్కరే యున్నారు. నేనే అన్నిపనులకు సాయముగాని వేఱొక్కరు

లేరు రాజకుమారులు కోరినడబ్బిచ్చుచున్నారు. ఏమికోరిన నిత్తురు. మర్యాదగలవారు. ఒక్కరనేవారు లేరుకదా. దూరముగా పోవనక్కఱలేదు. పిలిచిన పలుకదగినచోటు. మీరెండిండ్లకు నడుమనుండువారు నీజోలికి రారుకదా. నిన్ను జూచిన వారికి భయము. కావున నామాట గౌరవించి సరే అను. చూడు నాదెబ్బ. రూపాయలు నడిపింతును. ఈవఱకు వారికున్న పరిచయ మిపుడు తప్పినది. ఊరకే యున్నారు. మంచిసమయమే ఇది. నేను ఒక్కమాట చెప్పిన నెత్తిపై పెట్టుకొనేవారు. నీకెంతసహాయము చేయవలెనో అంత చేసెదను. అన్నివిధముల ననుకూలము. సరే అను. ఒక్కగంతువేసిపోయెదను అనెను. పద్మావతి నలుగురికి తెలియదా అనియడిగెను. ప్రియంవద నవ్వి వెఱ్ఱితల్లివమ్మా నేను గదా ప్రతిపూట మాటలు నడుపుదానను. దేవుఁడు కనుఁగొనఁజాలునా యనిచెప్పి చెవిలో గుసగుసలాడి ప్రమాణము చేయించుకొని వెడలి పోయి ఆసువార్త దాసున కెఱింగించెను. మరల రాగా: పద్మావతి ప్రియంవదా తరువాత బాగుండదు. ముందే చెప్పిన మంచిది. నాకు కావలసినవస్తువులు ఇచ్చుచుండవలయును. ప్రతిసారి నేను దేబిరించను నీవు కనుగొని తెచ్చి యీవలయును ఒకనాఁడు నామాట జరగకున్న నాటితో చెల్లు. నీకిష్టమైన రమ్మను. నేను రాను. ఇది నాభావము. అనఁగానే అన్నిటికి నంగీకరించి యీసాయంకాలములోపల నేమి సిద్ధముచేసెదనో చూడు. నీవు చక్కగా నలంకరించుకొనియుండు. నేనే నీతో మాటలాడి పిలుచుకొనివచ్చెద. అని పలికి పోయి రెండు తేలికగా నుండుపావడలు. సుగంధద్రవ్యములు తాంబూలమునకు

కావలసినవస్తువులు జలతారుచీరలు అవికలు పూవులు అన్నియు దాసుగారియిల్లు చేర్చెను.

పద్మావతియు శుక్రవారముగాన నుదయమే తలను పోసుకొన్నది కాఁబట్టి సాయంకాలము గమగమలాడుపిండితో దేహమును రుద్దుకొని వాసననూనెతో తలదువ్వుకొని చీకటి పడకముందే జడ జారవైచి పెందలకడ కొడుకున కన్నము పెట్టి సాయంకాలమే తీసియుంచిన అప్పడాలు గట్టిపడువాక కాచి పటికపంచదార కొంచె మందులో పడవైచి యేవో రెండురకముల పిండివంటలు అంగడి నుండి తెప్పించి పెనిమిటి పితృకార్యములు చేయించిసంపాదించిన వెండిపళ్లెములో నునిచి వేఱొకపళ్లెములో తాంబూలవస్తువుల నుంచి గంధము తీసి ఏవో యందులోఁ గలిపి భుజించి కొడుకును నిద్రపుచ్చి మంచము సిద్ధముచేసి దీపము సన్నగా నుంచి యిటునటు తిరుగు చుండెను. మాటలు తడబడుట పలుమాఱులు వీధివైపు చూచు చుంట యేదో క్రొత్తవిషయము జరగునని అట్టియామెయే పొరుగున నొంటరిగానున్న తొయ్యలి కనిపెట్టెను. దాసు గారి కామె కొంతకాలము స్నేహితురాలుగా నుండినదే. వయస్సుకాక మఱేదో కారణమున బెడిసియుండెను. ఆనాటి వృత్తాంతమంతయు నామె కనిపెట్టఁగల్గెను. చూతమని గవాక్షము కడ నిలువఁబడియుండెను. అందఱు భోజనము చేయుకాలమును గనిపెట్టి ప్రియంవద యొక్కొక్కవస్తువునే పద్మావతి యిల్లు చేర్ప నారంభించెను. తుదకు తాంబూలవస్తువులు పూవులు పిండివంటలపొట్లములు చేర్చెను. దానినడక వాయస గమనమును మించి శునకయానమును మీఱి జింకనడక నను

కరించుచుఁ జెవులపోతునడకను బోలియుండెను. గవాక్షము కడ నిలుచున్న ముద్దుగుమ్మకు మేను గగుర్పొడిచెను. పని కావలెనన్న తొందఱ, యెవరు చూతురో యన్న యను మానము, ఈపనికిం దిగితినా యని యందుఁజేమో యన్న భయము ప్రియంవద నొక్కసారిగా వెఱ్ఱిదానినిగాఁ జేయ సాగెను. జాముర్రాత్రి కాకముందే వస్తువులు చేర్పుట యా మిటారి వానిని దాఁచిపెట్టుకొనుట పూర్తియయ్యెను. వెలు పలికి వచ్చువా రప్పుడు కొలఁదిసంఖ్యగ నుండిరి.

మీసములకు రంగువైచి ముఖక్షౌర మప్పుడే చేసికొని జాజికాయ రెండుగా తఱిగి కొంచెము నల్లమందు దానికిం జేర్చి నేతిదీపమున కాచి యది కరఁగి కాయలోపలిభాగమునకు దిగగా నూరి మాత్రలుచేసికొని చేదనికూడఁ దలంపక యొకటి రెండు మాత్రలను పుక్కిటఁ బెట్టుకొని రసము మ్రింగుచు చలువపంచెలు కట్టుకొని సన్నని లాల్చి తొడుగుకొని పన్నీరు చల్లుకొని అత్తరువు చుక్కలుపడిన చేరుమాలును బట్టుకొని యీడుజోడుగా నున్నదనిపించవలయునన్న గంపెడాసతో వీధిదగ్గరకు వచ్చుచు మరల లోనికింబోవుచు వెఱ్ఱికాలభైరవుని వలెఁ దిరుగుచుండెను. ప్రతిక్షణ మాదాసుపాలిటి కొకయు గముగా కనుపట్టసాగెను. ఈతొందఱలో నున్నదాసుహృదయ మెంతనిశ్చలముగా నుండునో యెవరు చెప్పఁగలరో వారలే కవీశ్వరులు. ప్రియంవద కనఁబడఁగనే రావచ్చునా అని యడు గును. కొంచె మాగండి అనఁగానే కూలఁబడును. మఱునిమి సమున కింకను ఆలస్యమేటికే యని ప్రశ్నించును. పాప మాదాసుస్థితి చూచువారికి దుఃఖమును గలిగింపఁజాలియుం

డెను.. ప్రియంవద యింక రావచ్చునా అమ్మా యని యడుగఁ బద్మావతి తమలపాకులు చీల్చుచున్నాను. కొంచెము తాళవే యనెనుమఱియు నడుగ పిల్లవాఁడుకదలుచున్నాఁడు చూడవే అనెను. ఆవీధి నెవ్వరును బరుండువేళ కాలేదు. కాని దాసు బుద్ధికేమో తెల్లవాఱుజాముగాఁ దోఁచెను. నాలుగుదిక్కులు చూచుచుఁ బ్రియంవద వచ్చి త్వరగా రండి. అని మెల్లగాఁ జెప్పెను. ఆతొందఱలో నతనికి దొడ్డిలోనికిఁ బోవలసినపని పడెను.ఆగుడ్డలువిప్పి పరుగెత్తి పరుగున మరలవచ్చి వస్త్రధారణము చేయునప్పటి కెవరో మాటలాడుచు వీధిలో నిలువఁబడి యుండిరి. నూటపదాఱులు వారికి తిట్లుగా బహుమాన మర్పించుచు దాసు చూడవే పోయినారా ఇంక అక్కడనే చచ్చినారా అని ప్రియంవద నడిగి పోవుచున్నారని యామె చెప్పఁగా సంతోషించుచు నింటితాళములు జాగ్రత్త సుమీ యని వాని నిచ్చి నేను రాకుండ మీరెట్లు పోవుదురయ్యా యని యామె యడుగ కూడ రమ్ము అనిత్వరపెట్టుచుఁ దడబడునడుగులతో వీధిలోనికి దిగఁబోయి కాలు జాఱి పడి లేచి తుడుచుకొనుచు పద్మావతి యింటికింబోయి ప్రియంవద తలుపు మూసికొనుచు వెంట రాఁగా లోపలికిం బోయి గుమ్మముదగ్గర నిలువఁబడి చెప్పు పోయని దాసిని బంపెను. ఎదుటియింటి పురోహితుఁడు తటాలునఁ దలుపు తీసికొనివచ్చి చూచి యెవరక్కడ నిలుచున్నవారని యడుగుచు ఏమి దాసుగారక్కడ నిలుచున్నవారని పలుకరించెను. మాటలాడఁజాలక యూరక యుండలేక పిల్లవానికి జ్వరమువచ్చినదని చూచిపోవవచ్చితినని బదులు చెప్పెను. ఎపుడు జ్వరమువచ్చిన దనగా మూఁడుదినములైనదని పలికెను.

సాయంకాలము నేచూచితిని. మాయింట్లో ఆడుకొనుచుం డెను. అనుచుఁడా నాయింటికింబోయెను. పడకయిల్లు చక్కగా నలంకరించినట్లు కనఁబడెను. లోపలికిఁ బోవఁ బూనఁగా నాసం దడి యెఱింగి ప్రియంవద లోపలనే దాచిపెట్టుకొనియెను. పద్మావతివచ్చి దృష్టిదోషమున జ్వరమువచ్చినది. మంత్రింపదాసు గారు దయచేసిరని తెలిపెను. నేను మంత్రింతునని లోపలికిఁ బోవఁ బూనగాకుండ దృష్టిపెట్టినాను. కొంచెమునే పెవ్వరు రాఁగూడదని పలుకుచు సైఁగ చేయఁగా చింతలోనున్నదాసు కనుగొనలేక యట్లే నిలువఁబడియుండెను. పురోహితుఁ డరుగు మీఁద హాయిగా కూరుచుండెను ప్రక్కయింటిముద్దుగుమ్మ అయ్యా యని పిలిచెను. పురోహితుఁడు లేచిపోయెను. విష యము రహస్యముగా తెలిపి కనిపెట్టియుండుమనగా సరే యని యింటికిఁ బోయి తలుపుమూసెను. ఇదియే సమయమని దాసు లోపలఁ బ్రవేశించెను. ప్రియంవద నాలుగుచీవాట్లుపెట్టి లోప లికి రాఁగూడదా. అక్కడ నెందులకు నిలువఁబడితివయ్యా యని కసరెను సమయ మట్టిదిగాన నేమనక నీవింటికిఁబొమ్మని పంపెను పద్మావతి కూడవచ్చి దానిని బంపి తలుపు వేయుచుండఁగా నా పురోహితుఁడు వెలుపల నిలుచుండి ప్రియంవదా నీవాయింటికి బోవుచున్నావా. దాసుగారు మంత్రించుచున్నారా యని యడిగినవ్వెను. ప్రక్కయింటిముద్దుగుమ్మయు వీధిలోనికి వచ్చి ప్రియంవదను నవ్వుచుఁ బిలిచి యింట నెవ్వరులేరేమో పొమ్ము. చీకటికాలము గదా యనెను. ప్రియంవద యేమియుత్తరియ్యఁ బన్నలేక తలవంచుకొని యింటికిఁ బోయెను. పురోహితుఁడు కూడఁ బోయి దాసుగారూ యని పిలిచి పరుండిరా యని

నవ్వుచు నడుగగా నీయిద్దఱు తెలిసికొనియే యడుగుచున్నారని యెఱింగి దండముపెట్టి మీకేల యూరకపోయిన పదివేలని ప్రియంవద బతిమాలెను. ఏమి విశేషమని యాతఁ డడుగ నున్న దిది యని చెప్పక పోరాదని తెలిపెను. ఓహో నాకేల యని తనయింటికిఁ బోవుచు నెక్కడనుండి శాస్త్రులుగారు వచ్చు చున్నారని వీథిలోనున్న ప్రక్కయింటియమ్మయడుగఁగా నిషే కముహూర్తము చేయింపఁబోయి తాంబూలము దీసికొనివచ్చు చున్నానని చెప్పి పకపక నవ్వెను. ఆసంభాషణము రహస్య ముగా సాగనందున పద్మావతి దాసు వినిరి వీరిద్దఱుకాక యీమాటలు విని మఱినాలుగిండ్ల అమ్మలక్కలు వచ్చి దంపతి తాంబూలములకుఁ బిలువలేదా యని కొందఱును, ముత్తైదు వలయిననే పిలుపువచ్చును. విధవలకైనఁ దాంబూలములకుఁ బిలుపు రానని కొందఱును బలుకుచు రెండుజాములు పెళ్లిదాక నందే నిలునఁబడి తుదకు నిద్ర రాగా నిండ్లకుంబోయిరి. ఎంత రహస్యమనుకొనిరో యంత బహిరంగమయ్యెను. మఱుదిన మాపురోహితునిమూలమున నాసువార్త సంతబయలలో నాట్యమాడసాగెను. ఏది యెట్లున్నను బద్మావతికి సుఖజీవన ములు సాగుచుండెను. దాసు ప్రాతస్నేహితురాండ్రు పద్మా వతితో ద్వేషింపసాగిరి.

జానకీబాయి సీతాపతిగోస్వామి చెలిమిచే ధనవంతు రాలు కాసాగెను నాట్యకళ వృద్ధిచేయునెపమున గోస్వామి తన యింటికి వచ్చుచున్నట్లు లోకులకుఁ దెలుపవలయునని యూహించి పూర్ణాంబమూలమున సభ చేయించెను. పురుషులకుఁ గొందఱ కాహ్వానములు పంపిరి. ఎల్లరు సాయంకాలము సభ

సాగించిరి. జానకీబాయి యుపన్యసించుచు నీనగరమున నాట్యకళ నశించినదనియు దాని నభివృద్ధిచేయఁ దలంపు గలిగెననియుఁ బెద్దలు తోడ్పడవలయుననియు నిది లోకమునఁ బ్రాచీనకాలమునుండి పేరుగాంచిన కళయనియు భరతాది మహర్షు లిద్దాని రచించిరనియు మనము వారివంశములఁ బుట్టియు దానినివదలుట న్యాయముకాదనియు చెప్పి ముగించెను. తుదకు సీతాపతిగోస్వామిగారు అధ్యక్షులుగా నెన్నికొనఁబడిరి. కృష్ణాకుమారి జానకీబాయి యీయిరువురు కార్యనిర్వాహకురాండ్రుగాను పద్మావతి మంగళాంబయు ధనము నిలువఁజేయఁదగినవారుగను పూర్ణాంబ ప్రధానపోషకురాలుగను ఎన్నికలు సాగించిరి. ప్రతిదినము సాయంకాలము జానకీబాయియింట నృత్యముజరగునట్లు నేర్చుకొనఁదగినవారు ప్రాతఃకాలము కొందఱు మధ్యాహ్నము దాఁటినతర్వాతఁ గొందఱు రావలయుననియు, సాయంకాలము ప్రతిదినము ఎంతపనిజరగినది అధ్యక్షుఁడు చూచిపోవుచుండవలయుననియుఁ దీర్మానింపఁబడియెను. అంతకుముందే గోస్వామిగారు వచ్చుచుండుట తెలిసినందున నిది కేవలము వంచనయని కొందఱనుకొనిరి. పూర్ణాంబయింట సభ ప్రతిదినము సాగక వారమున కొకసారి జరగుటకు తీర్మానింపఁబడియెను. పలువురుబాలిక లావిద్య నభ్యసింప జానకీబాయికడకుఁ బోవుచుండువారు. కృష్ణాకుమారియు నభ్యసింపసాగెను. ప్రతిదినము గోస్వామివచ్చి తనపని చూచుకొనుచుఁ బోవుచుండువాఁడు. ధనము ప్రోగుచేసి దాచియుంచుటకు నియమింపఁబడినవారిలోఁ బద్మావతి పట్టుదలతోఁ బని చేయఁదగుసమయము లేక యేదో చేయుచుండెను. మంగళాంబ

శ్రమించి నలుగురిని జూచుచు నిచ్చినధనమును దాచియుంచు చుండెను. పద్మావతి దాసుచిత్తవృత్తి ననుసరించి పూర్వము రీతిగా బయటతిరుగుటను తగ్గించెనుగాని ప్రాంతమిత్రులు చూడకున్న నేమనుకొందురో యని యపుడపుడు పోవుచు వారితో సల్లాపములు సలిపి వచ్చుచు నెమ్మదిగా కాలముగడపుచుండెను.

# ఏడవకళ

మంగళాంబ కృష్ణానుమాతి చెలరేగుట. జానకీబాయి తోడుపడుట.
పద్మావతి పూర్ణాంబయెడ సద్భక్తి చేయుట.
దాసు పద్మావతి కెక్కువ తోడంగాపి సాయపోవుట.
హరిహరి యార్భాటము.

మంగళాంబకు భర్తపై నసూయ హెచ్చసాగెను. త్రిపాఠి నలుగురిలోఁ దిరుగుటకు జంకుచుండెను. అత్తమామ ఆతని లెక్కింపకుండిరి. భార్య నేమి దండించినను ముప్పురు కలిసి త్రిపాఠిని చీవాట్లు పెట్టుచుండిరి. సంపాదించు యోగ్యత లేకుండెను. ఏవివాహమునకు రమ్మనినను బోవ సంశయించు చుండెను. కాని భార్యను దండించుకుతూహల మధికముగా నుండెను. నోరుండక యేమన్నను దానికంటెఁ బదింతలు తిట్లు పడవలసివచ్చుచుండెను ఎక్కడికిని బోవఁజాలక యింటనుండ వీలులేక పాప మా త్రిపాఠి ఉక్కిరి బిక్కిరిగా నుండవలసినవాఁ డయ్యెను. ఏది యెట్లున్నను సకాలమున కాహారము తరువాత

చిలుతిండి యివిలేకున్న బాధపడువాఁడు. కావున వానికొఱకై యింటఁ గూరుచుండి తోఁచినపని చేయుచుండెను. మంగళాంబ ఱెక్కలు జాడించెను. కృష్ణాకుమారియింటనే సగముకాలము గడపుచుండెను. ఆమెయు సంగీతము నభ్యసించు నెపమున మంగళాంబను బిలిపించుచుండెను. పగఁటిపూట ఏనాలుగుగడియలో ఇంట నుండునుగాని తక్కిన కాలము కృష్ణాకుమారి యింట మంగళాంబ గడపుచుండెను. తల్లిదండ్రులు కూడ రవంత కోపముగలవారు కావలసివచ్చెను. అయిన నామెయందుఁగల వాత్సల్యమున నేమనక యుండిరి. ఇంటనున్న నాలుగు గడియలు తల్లిదండ్రుల కుపచారము చేయుచు వారి కాగ్రహముగలుగనీయక చేయుచుండెను. ఆవీథివారందఱు బుద్ధిమంతురాలనియే మంగళాంబ ననుచుండిరి. ఎవరు కనఁబడినను బద్ధావతివలె మాటలాడక తలవంచుకొనిపోవుచు నొకవేళ పిలిచినను మర్యాదగా వర్తించుచుఁ గాలము గడపుచుండెను. కృష్ణాకుమారి బ్రహ్మచారిణిగ నున్నదని పేరుపొంది యుండెఁగదా. సంసారమున ధనము తక్కువకాఁగా ఆవ్రతమును సర్వదా వదలుకొనకున్న నపుడపుడు వదలుకొనవలసినట్లు తోఁచుచుండెను నాగశైలద్వివేదియు నామె యాశ్రితులలో నొకఁడు మంచిమాటలాడుచు మర్యాదగా వర్తించుచున్నందున నలుగురు చేరుచుఁ బోవుచుండిరి. వారిమూలమున నామెకు ధనలాభము లేకున్నను ఆమెకు ఇబ్బందినిమాత్రము కలిగించుచుండిరి ఎవ్వరైన నామెతో విలాసముగా మాటలాడువారు వచ్చుసమయమునకు ఈవైదికబ్రువులు సిద్ధముగా నుందురు. కనుక వారు రామానిరి. ఆమెకు ధనము తగ్గినను మాటలకు

బిడరికము లేనందున మాటలాడుచుండెను. ఎవరినైన రక్షించుకొనినఁగాని సంసారయాత్ర సాగదని తోఁచుచుండెను. వీరు రాక మానరు పొమ్మనఁజాలక యెంత సౌఖ్యముగా వర్తించినను వారు కనుఁగొనఁజాలక వేళకు సిద్ధమగుచుఁ దాంబూలమడుగుచు నాకథ యీకథ చెప్పుచు నూరిలోనివార్తలు తెలుపుచు సాయంకాలము కాఁగా వెడలిపోవుచుండిరి. ఎవరైనను వేడుకగా వచ్చుసమయ మదియేయగుట వచ్చువారు వీరిం జూచి వెనుకకుఁ బోవుచుండిరి. తుదకు కృష్ణానుమారి తమకు సాయంకాలము రావలదు. సంగీత మభ్యసించుకాలమది. ఇబ్బంది కలుగుచున్నదని చెప్పెను. మేము మాట్లాడింపక వినుచుందుమని యావెఱ్ఱిబ్రాహ్మణులు బదులుచెప్పిరి. వీరికింక గట్టిగా చెప్పినఁగాని బోధపడదని అభ్యాసకాలమున పాట బాగుండదు. మీరున్న మాకు సిగ్గుగా నుండును. కాన ప్రాతఃకాలమువచ్చి మాట్లాడిపోవచ్చునని గట్టిగా చెప్పెను. నలువురిపెద్దమనుష్యులను జూడవలసినకాలము మాకదియే కావున ప్రొద్దున రాఁజాలము. సాయంకాలముననే వత్తుము. మావలన నీ కేయిబ్బంది లుండదని మరల నుత్తరము చెప్పిరి ఈదిక్కు వదలునట్లు లేదని యంతకంటె గట్టిగాఁ జెప్పలేక మంగళాంబకుం దెలిపి యేవిధముననైన వీరిని రాకయుండఁజేయుమా యని వేడుకొనెను. నీచేతనే కానిపని నాచేత కానే కాదు. పద్మావతితోఁ జెప్పిన ఫలించును. అని మఱుపిన మామెకుం దెలిపి రమ్మనిరి. సాయంకాలమున కామెయు దయచేసెను. పెద్దలు కూడ దయచేసిరి పద్మావతి యేమయ్యా! యింతమాత్రము మీకు తెలివిలేదా. నలుగురము

స్త్రీలము కూరుచుండి పాటయో పద్యమో చెప్పుకొనునప్పుడు మాకెదుట మీరు ప్రత్యక్షమగుట బాగున్నదా? నలుగు రేమందురు? కనుకనే కదా మిమ్ములను ఛాందసులని నలుగురు చెప్పుట. ప్రతిదినము పక్షితీర్థమునకు పక్షులు వచ్చునట్లు వేళ తప్పనీయక మాకుఁ బ్రత్యక్షమగుచున్నారే. మీకేమి తెలివి లేదా యని కసరివేసెను. మొగము చిన్నచేసికొని వెడలి పోయిరి. కృష్ణాకుమారి యాసమయమున లోపలికింబోయి వారు దయచేయఁగనే వచ్చి నవ్వుపట్టఁజాలక పద్మావతియే సరి ఒక్కక్షణములో సాగనంపెనే దయ్యాలవలె పీడించు స్వాములు వీరు శని వదలినదబ్బా అని వినుతించెను ఆనాఁడు మొదలు వారు రాకుండిరి. సీతాపతిగోస్వామి జానకీబాయి యింటికి ప్రతిదినము పోవుచున్నందున కృష్ణాకుమారియింటికి రాకపోవుటంజేసి యించుక అసూయ యామెపై కలిగినను దానిని గప్పిపుచ్చి జానకీబాయితో పూర్వమురీతిగా మాట లాడుచు మరల గోస్వామిని రావింప యత్నించుచుండెను. ప్రియంవదయే యప్పనికిఁ దగినదని దానిని దువ్వుచుండెను. నారాయణభట్టు పురోహితుఁడైనను రసికుఁడుకాన మంగ ళాంబయందుఁ బ్రీతిగలవాఁడై పతికి నామెకు కలహములు తీర్చుట యనుకారణమున నామెతో తఱచుగా మాటలాడు చుండెను. తనశక్తికొలఁదిగ నామెకు ధనసహాయము చేయు చుండెను. పద్మావతియు నతనికిఁ బాఁతపరిచయమే దాసును జేపట్టినతర్వాత వదలివేసెను. అందులకే ఆనాఁడతఁడు ఇంచుక శ్రమపడి నిద్రమానుకొని దాసును మాట్లాడించెను. దాసు

గారి కతనిపై నీసు గల్గెను. ఒకరికొకరికి సరిపడకపోయినను మాటలాడుచునుండిరి

జానకీబాయి మంగళాంబ సంసారవైభవ మాలకించి యామె నోదార్చుచు నించుక తోడ్పడఁబూనెను. నారాయణ భట్టు వారియింటి పురోహితుఁడు. కాన నతనితో నానెచ్చెలి మంగళాంబ బాగున్నదియా? ఇల్లునవలి రాదు. చూచుట కూడ కఱవైనది. ఆమెపతి మంచివాఁడే కదా యని యడిగి యతఁడు వృత్తాంతము దాఁపక చెప్పఁగా నీవామెను గొంచెము కనిపెట్టియుండుమని మందలించెను. తప్పక కనిపెట్టియే యున్నాను. నేను పురోహితుఁడనని యామె నన్నంతగా మర్యాదగాఁ జూడదని తెలిపెను నే నావిషయమును జక్క చేసెదను. ఏమియు నెఱుఁగనిది. ఆమెను కనిపెట్టియున్న నీకు సాయపడును. మనస్సు చాలమెత్తన. ఎంగవోటమి మెండు. అని తెలిపి వదలిపెట్టెను. పూర్ణాంబయు పద్మావతియు నపుడపుడు మంగళాంబకు హితముపదేశించుచు దూరపుస్నేహముకంటె దగ్గరస్నేహము మంచిదనియు నెపుడు పిలిచినను బలుకుచుండుననియు నాపత్సంపదలకు పనికివచ్చుననియుఁ గనుక నారాయణభట్టును వదలకుమని బోధించుచుండిరి. ఆమెయు నంగీకరించెను.

గోస్వామియొకనాఁడు దీపములు పెట్టినతరువాత నెచ్చటనుండియో యింటికిం బోవుచుండఁగా కృష్ణాకుమారి ద్వారముకడ నిలుచుండి చూచి నవ్వఁగా నతఁడు నాలుగడుగులు పెట్టి నిలువఁబడి యేమో యూహించి తటాలున లోపలికింబోయెను. మంగళాంబ యావిషయ మెఱిఁగి పనియున్నట్లు

నటించి యింటికింబోయెను. కృష్ణాకుమారి నమస్కరించి దారి తప్పివచ్చితిరే అని

"పురాణమిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవమిత్యవద్యం,
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః."

(ప్రాతగాని క్రొత్తగాని గుణముండినదానినే రసికులు గ్రహింతురు. మూఢులు ఒకరుచెప్పినదానినే నమ్ముదురు.)

అనుశ్లోకమును జదివి తాంబూలము దగ్గర నుంచెను. కూరుచుండుమని గోస్వామి కోరెను. మీసముఖమునఁ గూరుచుండునంత యోగ్యత కలదా? పాట యాటరాని మొద్దును గదా నేనని తలవంచుకొని కన్నీరు వచ్చినట్లు నటించి పైఁట కొంగుతో కన్నులు తుడుచుకొనియెను. నిజముగా దుఃఖించె ననుకొని గోస్వామి కన్నీరు తాను దుడిచి పోయినదానిం బోనిమ్ము. అయినది పోయినది ఇఁక వచ్చుచుంబోవుచుండుమని ప్రమాణముచేసెను. నావంటివా రెందఱో. వారురానిచ్చినఁ గదా తమరు రాఁగలరు. పాపము మీరేమిచేయుదురని హెచ్చరించెను. ఆమోహము తగ్గినది. పొరపడితిని గుణము గ్రహింపఁజాలకపోతిని. ఆస్నేహమునకు ఫలముగా నాలుగు వందలు మందులకు వ్యయమయ్యెను. అయినను మాటయిచ్చి తినిగాన వదలఁజాలకయున్నాను. చాల నేర్పుగత్తె. అని పలికి తనయొద్దనున్న యేఁబదిరూపాయ లామెకిచ్చి తాంబూలాదులచే నాలుగుగడియలు పుచ్చి యింటికింబోయెను.

సీతాపతిగోస్వామి ధనవంతునికుమారుఁడు. తండ్రి రాజును మోసగించి యేదో వేరున ధనమార్జించెను. భూములు గడించెను. ఏకపుత్త్రుఁడగుట గారాబమునఁ బెంచి

విద్య చెప్పించెను. ప్రభువుదగ్గర పలుకుబడిగలవాఁడు కావున నుద్యోగ మిప్పింప యత్నింప నతఁడు చేయలేనన్నందున నూరకుండెను కొంతకాలమునకుఁ దండ్రి గతించెను. తల్లి భార్యయు నుండిరి. భార్య సాధ్వి. సదాచారవంతురాలు. విద్యావంతురాలు. అంతసొగసుగత్తె కాదు. ధనము వయస్సు అవివేకము ఒక్కసారిగా చేరినందున గోస్వామి యీవృత్తికిం దిగెను. జానకీబాయిస్నేహమునఁ గొంత వ్యయమయ్యెను. కాని చేతినిండ ధనము గలదు. ఇరువదేండ్లు నిండనివయస్సు, నగరమున రాజుకొలువుకూటమునఁ బలుకుబడి కలిగినందున సంపాదించు నవసరము కానరానందున నిష్టానుసారము తిరుగుచుండువాఁ డయ్యెను. తల్లి లోకజ్ఞానశూన్యురాలు. భార్య పతివ్రత కావున నతనియిష్టమున కడ్డులేకుండెను.

"యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా,
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్?"

అన్న వాక్యము గోస్వామియందు సరిపోయినదనవచ్చును. ఒక్కసంవత్సరము కాకమునుపే రెండువేలకు మించి జానకీబాయిస్నేహమున కర్చుపడి గొప్పచేసెను ఇంక లేదన్నమాట లేనందున నాచింత యతనికి లేకపోయెను. కొన్ని జబ్బులు కలిగినందున నించుక బలహీనుఁడైనను స్నేహమును గొఱత గాంచకుండ వర్తించుచుండెను.

పద్మావతికి సుఖజీవనము సాగుచుండెనని చదివితిరిగదా. క్రమముగా దాసునకు మిక్కిలి ప్రీతిపాత్రురాలయ్యెను. ఒక దినము దాసు రెండవజామున పిల్లవానిం జూడఁ బద్మావతి యింటికిం బోవుచుండఁగా నెవరో తుంటరులు నాలుగురాళ్లు

తగులకుండ వేసిరి. అవి రెండుమూఁడుసారులు దగ్గర పడెను. ఒక్కటిమాత్రము దాసునకు తనరాకను దెలుపవలయునని కాఁబోలు కుడిభుజమును ముద్దుపెట్టుకొనియెను కొంచెముగ నాభాగ మిచ్చెను. ఆదిన మెట్లో గడపి మఱుదినమునుండి యింటికి రప్పించుకొనుచు నామెయింట పిల్లవానికడ ప్రియంవద నునుచుచుండెను. ఒక్కనాఁడు నాటకమునకుంబోయి యందఱు నిండ్లకువచ్చిరి. రాత్రిలో సగము గతించియుండెను. కుమారుఁడు నిద్రపోయినతర్వాత పద్మావతి దాసును జూడఁ బోయెను. మఱికొంత సేపటికే వారందఱును వచ్చిరి. ఎవరి యిండ్లలో వారు ప్రవేశించుచు నాటకము బాగున్నదనియు నింక నేవో యామాటలు చెప్పుకొనుచుండఁగా పద్మావతి కొడుకు నిద్రపోవుచు నులికిపడిలేచి గట్టిగా నమ్మా అమ్మా యని యేడువసాగెను. ప్రియంవద జోకొట్టెనుగాని వాని యేడుపు మఱింత యయ్యెను. ఇండ్లలోనికిఁ బోవుచున్నవారట్లే నిలువఁబడిరి. ఇరుగుపొరుగు ఎదుటనుండుగృహము వారే వారు. అందు నారాయణభట్టు నొకఁడుగా నుండెను. నలుగురిని మెల్లగాఁ బిలిచి వేడుకచూడవలయునని హెచ్చరించి యింటిదగ్గరకు పోయి పద్మావతీ యని పిలిచి యెక్కడ నున్నది మీయమ్మ నాయనా యని పిల్లవానిని బలుకరించెను. ఇంటనున్న ప్రియంవద మాటలాడకుండెను. నారాయణభట్టు గొంతు వినఁబడఁగానే అమ్మా అమ్మా యని మఱింతగా వాఁడేడువసాగెను. తలుపుసందులనుండి చూచి యేమే ప్రియంవదా పలుకవు. ఆమె నెక్కడికిఁ బంపితివని యడిగి తలుపుతీ. పిల్లవాఁడు కడుపుబ్బ నేడ్చుచున్నాఁడు. అని కసరినట్లు మాట

లాడెను. ఆనాఁడు భట్టుగారికి గుట్టుతెలిపిన పొరుగింటిముద్దు గుమ్మ లేచివచ్చి అయ్యో పిల్లవానికడుపు వాచిపోవుచున్నది? ఎక్కడికిపోయినదో యీవేళప్పుడు? ఏడువకుము. ఏడువకుము నాయనా అని బుజ్జగించుచుఁ దలుపుతీయవే చెత్తముండా అని ప్రియంవదను నాలుగుమాఁటు లాశీర్వదించెను. పద్మావతి రావలనుపడక యుండెను. ప్రియంవద తలుపుతీసెను. ఇరువురు లోపలికి వెళ్లిరి. వీధిలోని తక్కినవారును వచ్చి యింటిముందు నిలువఁబడిరి. పిల్లవాఁ డేడుపు మానలేదు. నారాయణభట్టు ఆముద్దుగుమ్మతో దాసుగారింట నున్నదేమో పద్మావతిని పిలిచి రమ్మనెను. త్వరగాపోయి తలుపుతట్టి పిల్లవానిపొట్ట వాచి పోయినది. ఇంక చాలును రాపద్మావతమ్మా యని గట్టిగాఁ బిలిచెను. మఱొకమార్గమున రావలనుపడదు. విధిలేక పిల్ల వానిపై నున్న ప్రీతితో తలుపుతీసికొని కన్నులు ఫులుము కొనుచు పద్మావతి బయటికివచ్చెను. అందఱు చూచి ముందు పిల్లవానియేడుపు మానిపింపుమని పడదిట్టిరి. పోయి వానినెత్తు కొని బుజ్జగించగా వాఁడు రెండుగడియల కేడుపుమానెను. ఇంతలో నొకరుపోయి డాక్టరును బిలుచుకొనివచ్చిరి. ఆతఁడు పొట్టపట్టిచూచి యింతసేపేల యేడ్చెనని యడిగెను. అమ్మలేదని యేడ్చెననిరి. ఎక్కడనున్న దామె యనఁగా దాసుగారింట నుండినది. ఈదాసిని గావలిపెట్టి పోయినది. అమ్మా యని యేడువసాగినాఁడు. మేమెంత బుజ్జగించినను మానలేదు. తుదకు పిలువగా పిలువగా తలుపుతీసికొని యిపుడే వచ్చు చున్నది. వీఁడింక నేడుపుమ్మానలేదు. అని చెప్పిరి. పిల్లవానిని వదలిపెట్టి యేలపోయితివమ్మా అక్కడికి అనఁగానే భట్టు

ఆపని మీాకెందులకు లెండి. పడక అక్కడనే కాఁబోలు అనెను. ఏమే ప్రియంవదా ప్రతిదినము నీవిక్కడనే పిల్లవానికి తోడుగా పడుకొందువా అని నలుగురు నడిగిరి. అది బదులు చెప్పలేక మిణుకరించెను. ఇఁకపో చాలును. అని నలుగురు నాలుగుచీవాట్లు పెట్టగా నది మొగము మ్లాడ్చుకొనుచు దాసుగారింటికిం బోయెను. భట్టు లోనగువారు నోరుచేసికొని నీమర్యాద యుండినట్లేయున్నది. రేపటినుంచి మాయింటనైన నుంచి నీయిష్టానుసారము పండుకొనుమని గబగబ దండించిరి. ఎవ్వరేమన్నను నోరెత్తక పద్మావతి యూరకుండెను. అంతట మానక నలుగురు వీథిలోఁ జేరి దాసుగారిమూలమున గాపురములే పాడగునట్లున్నవి. ఏమహాత్ముఁడు ఈవీధికి మళయాళ మని పేరుపెట్టెనో గాని సార్థకముగానే యున్నది. ఈదాసి ముండను ముందుపండ్లు రాలఁగొట్టవలయును.ఇటువంటి తారుపుకత్తె లుండరాదు. అని గట్టిగా నందఱు ననసాగిరి. నిద్ర పోవువారుకూడ లేచివచ్చి యేమని యడిగి భట్టు గట్టిగాఁ జెప్పఁగా నయ్యో అయ్యో ఏమి యన్యాయము? ఇంక దాసు గారు పద్మావతిమఱొకవీధిన కాపురము చేయవచ్చునని నాలుగు వీథులకు వినఁబడునట్లు కేకలువైచిరి. ఆఁడువారు లోపలికిఁ బోయి పద్మావతీ నీకేమి పోఁగాలమే? ఇంతబహిరంగమా? భోగమువారు నీకంటె మేలే. అని తెల్లవాఱుజామువఱకు వీధిలో ధ్వనిగలుగ దూషింపసాగిరి. ఎవరేమన్నను నోరెత్తక పద్మావతి శాంతమువహించి యుండెను. తెల్లవాఱు జామున దాసు ఎవ్వరికిఁ దెలియకయుండ గ్రామాంతరమునకుం బోయెను. నాటినుండి ప్రియంవదయన్న తారుపుకత్తె

యనియు సంసారములను బాడుచేయునదియనియుఁ దలంచి యంతగా దానిని నమ్మకుండిరి. భుజంగద్వివేదిని జూచినవా రెల్లరు మిత్రుని బొగడుచుండిరివికదా. సత్ప్రవర్తకుఁడే యని యెత్తిపొడుపుమాటల సిగ్గుపడఁజేయసాగిరి. తలవంపులయ్యెఁ గదా యనుకొనుచు నతఁడుండెను. రాజపుత్త్రుల కీవార్తలు తెలిసెను. వారు దానుకడ నీకఁ జేరరాదకొనినట్లు అందఱు చెప్పుకొనసాగిరి. భుజంగద్వివేదికి గూడ నుద్యోగ మూడి పోయెను.

నందనారామవీధియం దుత్తరభాగమునఁ గలయిండ్ల వరుసలో పూర్ణాంబయింటికిఁ దూరముగా నొకగృహమున నొకవిప్రుఁడు కాపురముండెను. హరిగిరి యని యతనిపేరు. తఱుచుగా నాదేశవాసులగుబ్రాహ్మణులు మత్స్యముల భుజించువారు. అందితఁడు చేరినవాఁడే. ధనవంతుఁడు. రాజకీయములందుఁ బ్రవేశముగలవాఁడు. చేతిపనియందు దక్షుఁడు. రాముని వేదము తనవేద మొక్కటియే యని చెప్పుకొని గర్వించుచుండువాఁడు. ఆతఁ డీమిటారులసంబంధము గల వాఁడు కాఁడు. తనపనిమాత్రము చూచుకొనువాఁడు. తనకంటె ధనవంతులు లేరనుకొనునహంకార మొకటియే యతనికిం గల్గిన దుర్గుణము. తక్కినవి సుగుణములే యనవచ్చును. తఱచుగా రాజకీయోద్యోగులతోఁ గలిసి తిరుగుచుండువాఁడు. ప్రొద్దు పోవుటకుంగాక తనపనులుగూడఁ గొన్ని యగునని యతఁడు తలంచియుండు ననుకొనవలయును తనపట్టినకుందేటికి మూడు కాళ్లే యనుమొండిపట్టుగలవాఁడు. కొంద ఱతనింగూడ నాశ్రయించువారలుండిరి. వారు తన్ను వినుతింపఁగాఁ దానం

తవాఁడనే కాఁబోలునని యూహించి యుబ్బుచుండువాఁడు. ఏవో యిట్టివి యొకటి రెండుదుర్గుణములుతప్పఁ దక్కినవి సుగుణములే యనవచ్చును. ఈరెండును దక్కినసద్గుణములఁ జంపునవియే కాని బ్రదుకనిచ్చునవి కావు. రాజోద్యోగులలోఁ గొందఱు మిత్రులని మిట్టిపడుట క్రమముగా నలవాటయ్యెను. ఇతనిమూలమునఁ దమపనులగునని గొందఱు వెంబడి తిరుగసాగిరి ఎప్పుడు చూచినను వెంటనుండుటయే గొప్ప యధికారమనుకొని యతఁ డుబ్బుచుండెను ఆశ్రితులకు మహాదాతవలెఁ గనఁబఱచుచు నీయకున్న నిచ్చినంతమాట చెప్పుచు వారిని వెంటఁబెట్టుకొని తిరుగుచుండువాఁడు.

## ఏనిమిదవకళ

ఉపసచివుఁడు దేశాంతరమున కరుగుట.
త్రిపాఠి కాపని నిష్పింప మిటారులు యత్నించుట.
హరిగిరి కంకణముకట్టుకొని యెగురుట.
గోస్వామి మహాప్రయత్నముచేయుట.
తుద కది మిటారులమూలమున ఫలింపనుండుట.

మాళవరాజుగారికడ ముష్వురుమంత్రులు గలరు. ప్రధానమంత్రి రాజబంధువు. రెండవమంత్రి బ్రాహ్మణుఁడు. మూఁడవమంత్రికి ఉపసచివుఁడని యాసంస్థానమున నామము. ఆతఁడు ప్రశంసనార్హముగాఁ దనకార్యముచేయుటంబట్టి ప్రఖ్యాతిం గాంచెను చాలకాలముకాఁగా నేపాళదేశమునం

ప్రధానమంత్రిపద మిత్తుము. రమ్మని రాజానుచరులు వచ్చి చెప్పిరి. అతఁడు పోప నుంకించెను. పెక్కండ్రు విచారించిరి. బ్రాహ్మణునిస్థానము కాన నామంత్రిపదము బ్రాహ్మణునకే యుండవలయుననియు, నారాయణమూర్తి త్రిపాఠియందుల కర్హుఁడనియుఁ గొందఱు గుజగుజలారంభించిరి. త్రిపాఠి మామగారిని బురికొలిపి ప్రయత్నింపఁజేసెను. త్రిపాఠిభార్య మంగళాంబ మిటారులసభ త్వరితముగా జరుపవలయునని కృష్ణాకుమారికిం దెల్పెను. పూర్ణాంబ యప్పని కుపక్రమించెను. జానకీబాయి లోనగువారును బూనిరి.

ఆతెల్లవాఱుజామున నెవరికిఁజెప్పక కాలికి బుద్ధిచెప్పిన పురుషోత్తమదాసు దూరముగా నుండునగరమున కరిగి కొలఁదినెలలు జరుగఁగా భుజంగద్వివేదికి రహస్యలేఖము వ్రాసి పద్మావతిం బంపవలయుననియు, ప్రియంవదకు నీవిషయము రహస్యముగాఁ దెలిపి పద్మావతికిం జెప్పించి ప్రయాణము చేసి పంపవలయునని ముందుగాఁదెలిపినఁద్రోవయందే కాచియుండు ననియు పెద్దయూరుగాన నన్నుఁ గనుఁగొనఁజాలక శ్రమ పడుననియు వ్రాసెను. భుజంగద్వివేది యట్లే చేసెను. ప్రియం వద యావార్తను దెలిపి పద్మావతి నొకదినము రాత్రి ప్రయాణముచేసి పంపెను. ఆదేశమున నాకాలమున నత్యావసర ముగాఁ బోవు ప్రయాణసాధనములు విశేషించియున్నందున మఱుదినము దాసుండు గ్రామముచేరెను. ఊరబయటనే కాచియున్నదాసు ప్రియురాలిని బిలుచుకొనిపోయి తనబంధువులు చూచిన నేమందురో యని వేఱొకయింటఁ గాపుర

మునిచి వారియోగక్షేమములు విచారించుకొనుచుండెను. పద్మావతియుఁ గుమారుఁడు హాయిగా కొలఁదికాల ముండిరి.

మిటారులసభ జరగునాఁటికిఁ బద్మావతి యూరలేదు. ఎందుండునది స్పష్టముగాఁ దెలియదు. పుట్టినింటికిం బోయినదని కొందఱు, అక్కడదగ్గరకుఁ బోయెనని కొందఱు పలుకసాగిరి తుదకు మెట్టినింటికిం బోయెనని యెవరో తెలిపిరి. దాసునివాస మెందని తెలియకయుండెను. కృష్ణాకుమారి మంగళాంబతో నారాయణభట్టుమూలమునఁ గనుఁగొనుమని పురికొల్పెను. ఆమె అదెంతపని యని తనతో మాట్లాడ నతఁడు రాఁగా నీవిషయము కనుఁగొనవలసినదని యాజ్ఞాపించెను. ఆతఁడు మహాప్రసాదమని ద్వివేది నడిగెను. ఇరువురు బంధువులు. కాన నతఁడు విధిలేక చెప్పెను. ప్రియంవదను నాలుగుమాఱులు దబాయించి పిలుచుకొని రావలయును. లేకున్న దాసియిల్లు పాడుచేయుదుమని తెల్పి రమ్మని పంపిరి. విధిలేక యాదాసి వెడలెను. దారిబత్తెము మంగళాంబయే యిచ్చెను. ఏయుపాయముచేనైనఁ బిలుచుకొనిరమ్మని పురికొల్పెను. కృష్ణాకుమారి యిట్లు వ్రాసి ముద్రవైచి ప్రియంవద చేతికిచ్చెను.

"నెచ్చెలీ! యిట మనవలనఁ గాఁదగిన మహాకార్యము పొసఁగినది. మంగళాంబకు దానిమూలమున భాగ్యము లభించును. త్రిపాఠిని జూడనక్కఱలేదు. మంగళాంబను జూడవలయును. మేమెల్లరము శక్తివంచనలేక పాటుపడుచున్నారము మనది శరీరకష్టము. దాన నొకరికి మేలుకలుగునేని అంతకంటె మనకుఁ గావలసినదేమి? మనకు ధనవ్యయము లేదు. శరీర

మును శ్రమింపఁజేయవలయును. దానిచే నది అరిగిపోదు. కొలఁదిదినములు శ్రమంపడవలయును. మనవి మురికిగుంతలు. ఈతుచ్ఛశరీరములచే శాశ్వతకీర్తి సంపాదించుట యెంత యుత్తమమో ఆలోచింపుము. ముఖ్యముగా నీమూలమునఁ గాఁదగినపని యొకఁడున్నది నామూలమునఁ గాఁదగినదానిని సాధింపఁ గంకణముకట్టుకొనియున్నదాన. మంగళాంబ శ్రమించితయంత యనరాదు. రేయింబవళ్లు శరీరము నీకార్యమునకు దానముచేసినది జానకీబాయి తోడుపడఁ బూనుకున్నది. పూర్ణాంబ 'మూలకందం ముకుంద'మ్మన్నట్లు సర్వకార్య భారము మోయ సిద్ధముగా నున్నది. నీవువచ్చినంతన మనము నడుముకట్టుకొని మనశరీరముల వ్యయపఱచి పనిసాధింప యత్నింతము. పురుషుల నోడించి తీఱవలయును. పురుషులు వృథా పంతెము వేసికొంటిమిగదా. మనమేమింయు నోడింపఁ జాలమని నగచ్చుచుఁ బోవవలయును. తరువాత మనకు దాసులుగా నుండవలసినవారే యగుదురు. నీకచ్చుట నెంతపాయిగా నున్నను బట్టుదలకొఱకైనను రావలయును. సమక్షమునఁ జెప్పఁదగినమాటలు పెక్కులున్నవి. అవి వ్రాయ నను వుపడవు. కన్నులకఱవుదీఱ నిన్నుఁ జూడవలయునని వేచియున్నాను. ఇట్లు నెచ్చెలి కృష్ణాకుమారి." ఈపత్రికను దీసికొని ప్రియంవద యెగురుచుఁబోయెను.

నారాయణమూర్తి త్రిపాఠి హరిగిరి నాశ్రయించెను. సీతాపతిగోస్వామిని దినమునకుఁ దక్కువపక్షము రెండుసారులైనఁ జూచుచుండెను. నారాయణభట్టు నాశ్రయించెను. పడరానిపాట్లు పడసాగెను. కాని అతనిఁ జూచినవారందఱు పలు

సారులు రాఁజాలరు, ఆయాసపడుదురు. మీకుండులోఁప
మెలుంగుదుము. కుదురుగదలక కూరుచుండుఁడు. పాటుపడు
వారు వేలుగానున్నారు. మీకేల యీశ్రమములని మంద
లింపసాగిరి. మంగళాంబ జానకీబాయిని గట్టిగాఁ బట్టెను.
ఆతరుణీమణి గోస్వామిని నొక్కసాగెను. కృష్ణాకుమారియు
జానకీబాయియు నొకరిని మార్చి యొకరుగాఁ గట్టిగాఁ బట్టు
కొని నొక్కుచున్నందున నుక్కిరిబిక్కిరియై యతఁడుకూడ
నాకార్యమునకుం బూనుకొనెను. హరిగిరి స్తోత్రప్రియుఁడు.
త్రిపాఠికాపదము లభించినఁ దస్థాలమునఁ దనకు నెన్నియో
లాభము లుండునని యూహించి యెంతధనమైనను వ్యయింతు
నని వాగ్దానముచేసెను.

కృష్ణాకుమారికి సీతాపతిగోస్వామి గాక మఱియొక
యాంతరంగికమిత్రుఁడు కలఁడు. ఆదేశమునఁగల ద్విజులలోఁ
జేరినవాఁడు చేఁపలు భక్షణార్హములనియు మాంసభక్షణ
నిషేధము చేఁపలకు లేదనియు వానికి మాంసము లేదనియు
నాదేశమునఁగల ద్విజాతులయాశయము. పండుగులయందు
వానిని దప్పక భుజించువారు. శూద్రులు వంటచేసిన ద్విజా
లాదేశమున భుజింతురు. ఆతెగకుఁజేరినవాఁడే యాకృష్ణా
కుమారిమిత్రుఁడు. రాజకీయములందు దనకుఁ బ్రవేశముకల
దనియు నలుగురిని వెంటనుంచుకొని తిరుగుచుండువాఁడు.
కృష్ణాకుమారిప్రోత్సాహమున నతఁడు త్రిపాఠిపక్షమునఁ బని
చేయఁ గంకణము కట్టుకొనియెను. నాగోజీదత్త యని యతని
పేరు. హరిగిరి గోస్వామి దత్త అను నీముగ్వురు త్రిపాఠి

ఆశ్రయమునను బ్రియురాండ్ర ప్రోత్సాహమునను బనిచేయఁ బూని రాజోద్యోగుల నాశ్రయింపసాగిరి.

రాజసోదరు లిరువురు గలరు. రాజ్యభాగము వారికి లేదు. భుజించి తిరుగుచుండువారు. దాసు శిష్యులు. దాసు కాలికి బుద్ధి చెప్పఁగా వారును దిరుగసాగిరి. అంతకుముందే తిరుగునలవాటు గలవారు ఇప్పుడు పని పనుపడియే లేని కారణమున మఱింత తిరుగసాగిరి. నాగోజీదత్తు అందుఁ గడపటిసోదరునకు రవంత మిత్రుఁడు. కనఁబడిన మాటలాడువాఁడు. అంతమాత్రమునకే నామిత్రుఁడని దత్త చెప్పుకొని యుబ్బుచుండువాఁడు. రెండవరాజసోదరుఁడు హరిగిరి గోస్వాములకు మిత్రుఁడు. వీరు మువ్వురు కలిసి సంచరించువారు. కావున వారిమూలమున రాజుగారికిఁ జెప్పింపవలయునని వీరి యత్నము. కాని వీరి కీపని చక్కఁబెట్టఁగల మనునమ్మకము చాలకుండెను. దత్తకృష్ణాకుమారితో నేనొకసారి యువరాజు సోదరుని మనయింటికిం బిలుచుకొనివత్తును. లాలించి వేలుపుచ్చి త్రిపాఠికార్యము చక్కపెట్టుమా యని ప్రోత్సహించెను. నాయభిప్రాయ మద్దియే. వారినెట్లైన నింతదనుకఁ దోడుకొని రండు. తర్వాత నాశక్తి చూడుఁడని యుత్తరమిచ్చెను. హరిగిరి గోస్వాములు యువరాజును లోఁబఱచుకొనుత్రోవ యొద్దియని యాలోచించి యింతకంటె మంచియుపాయము లేదని నిశ్చయించి జానకీబాయికిం దెలిపి మంగళాంబకుం దెలుపమని చెప్పిరి. ఆమె యిదియేమి భాగ్యమా. అని మంగళాంబను బిలువనంపి రహస్యముగా విషయముం దెలిపిన నామె శిరసా

వహించి చేయఁబూనెను. ఎవరియింట సమావేశము చేయింప వలయునా యని యూహించి హరిగిరి గోస్వాములు పూర్ణాంబ యింటికింబోయి రహస్యముగా విషయముం దెలిపిరి. ఆమె యుబ్బి దానికి నేనేర్పాటుచేయుదును. వారిని మనయింటికిం బిలుచుకొనివచ్చుట మీభారమని తెలిపెను. ఆసంవిధానమును మేము చేయుదుమని వారు పనివినిరి.

మాళవదేశాధిపతి కొకమిత్రుఁడు కలఁడు. ఆతఁడు రాజబంధువులలోనివాఁడే. కాని యించుక దూరమున నుండెను. తఱచుగా వ్యవహారములజోలికిం బోవువాఁడు కాఁడు. కనుక భూపతి కతనిపైఁ బ్రీతి మెండుగ నుండెను. ఒక్కకార్యమునైన నా కీసహాయము చేయవలసినదని యడుగ లేదుకదా యని రాజూహించెను. అట్టిమిత్రుఁడు దొరకునా యని యందఱకుం జెల్పుచుండువాఁడు. ఆమిత్రునియం దొక లోపము గలదు. వీథివెంబడిపోవు నాఁడువారిని చూచు చుండుటయే యాలోపము.

"కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావముచేసి మరలువాఁడు."

అన్నసూ యతనికిఁ జక్కఁగాఁ దోఁపలేదేమొ! ఆతని పేరేమో కాని మిత్రుఁ డనునదియే వ్యవహారనామ మయ్యెను. నగరవాసమున నారోగ్యము చెడునని దూరముగా నొకపల్లియందుండువాఁడు. ఆతని నాశ్రయించిన మనయీ కార్యము ఫలించునని హరిగిరికిం దోఁచెను. అతఁడు గోస్వా మికిం జెప్పెను. వారిరువురు నొకనాఁడు నాగోజీదత్త కనఁ బడఁగాఁ జెప్పిరి. ఇది యన్నింటికంటె మంచియుపాయమని నే

నీపని సాధింతునని శపథముచేసెను. వారిరువురు సంతోషించి యిండ్లకుఁ బోయిరి. ఆమఱుదినమే దత్త కృష్ణాకుమారియింటి కింబోయి యథేష్టాలాపముల సంతోషించి యింటికిం బోవు నపుడు కృష్ణాకుమారి! మన ప్రయత్నము ఫలింప మంచి యవ కాశము దొరకినది. నీమూలమున నది యగును. రాజుగారి మిత్రుఁడు మిత్రుఁడను పేరు గలవాఁ డున్నాఁడని నీవును వినియే యుందువు. ఆతఁ డుండుపల్లి యిచటకు నాలుగు క్రోశముల దూరమున నున్నది. నీవు పోయి, "కార్యాంతరమున వచ్చితి ననియు, వచ్చి మిమ్ము దర్శింపక యుండఁబోరాదని దర్శనార్థము వచ్చితిననియుఁ దెలిపి, యీమాట యామాట చెప్పి తమ రెప్పు డైన శైలపురమునకు దయచేసినపుడు మాయింటికి దయచేసి పావనముచేసి వెళ్లవలయునని వేఁడెదను. నందనారామవీథిలో నాకుటీరము కలదు. బ్రహ్మచారిణి యిల్లెక్కడ? అని యడిగినఁ జెప్పుదురు. తమరు దయచేయునది తెలిపిన నేనే వచ్చి మిమ్ముఁ బ్రార్థింతును. బీదరాలను. బ్రహ్మచారిణిగా నుండ నెంచితిని. మీవంటివారు దయచేసిన నేయభ్యంతరము లేక మాటలాడుదును. అల్పులతో మాత్రము మాటలాడను. మీవంటివారే నాయింటికి వచ్చుచుందురు. మర్యాదగ నే యింతదనుక వర్తించుచున్నదానను. నగరమంతట నావార్త వ్యాపించియే యున్నది." అని ప్రార్థించి యందు క్షణమాత్రమే యుండిరమ్ము. తరువాత నే నాపనిని జక్కఁజేసెదనని తెలిపెను. ఆమెయుఁ బకపక నవ్వి సమ్మతించెను. దారికర్చులకు రూపాయ లిచ్చి యతఁడు తనకార్యము ఫలించె ననుకొనుచు నింటికిం బోయెను.

పార్వతీబాయి శకుంతలాదేవి యనువా రిరువురును గృష్ణాకుమారికి నెచ్చెలులు. వీరును మంగళాంబకుఁ దోడు పడఁ బూనిరి. ఈయిరువురు మంగళాంబ కృష్ణాకుమారి యను నిరువురు కలిసి నలువురును దీక్షఁబూనిరి. పూర్ణాంబ వీరికి చేయూఁతగా నుండెను. జానకీబాయి గోస్వామిని మాత్రము పురికొల్పుచు నారాయణభట్టును బ్రోత్సహించుచు నుండెను. ఈవిషయమంతయు నాలకించిన తుంటరు లిద్దఱువచ్చి పూర్ణాంబను జూచి మేము సాయపడవచ్చునా యని యడిగి అంత కంటెఁ బుణ్యము కలదా యని యామె నవ్వుచుఁ బలుక నట్లే యని ప్రమాణముచేసి యటునిటు తిరుగుచు నానెపమున మంగళాంబను, గృష్ణాకుమారిని, బార్వతీబాయిని, శకుంతలను గలిసికొనుచు నేవో నాలుగుకబుర్లు చెప్పుచు నిష్టానుసారము వచ్చుచుం బోవుచుండిరి. ఒక్కనాఁడు యువరాజా దారినఁ బోవుచుండఁగా వీరిరువురును వెంబడి పోవుచు నేవో మాటలాడుచు వీథి దాఁటించి వచ్చిరి. యువరాజమిత్రులని వారిని దలంచి మంగళాంబ లోనగువారు వారు వచ్చినపుడెల్ల మాటలాడుచు గుసగుసలు సల్పుచు వారిని దమవారినిగనే తలంచి యుండిరి. ఇదియే చాలునని వారును వీరియిండ్లచుట్టు తిరుగుచుండిరి. సందడిలో సమారాధన మనుసామెత యిపుడు సార్థకమయ్యెను గదా. ఇట్లు కార్యము నెఱవేర్పఁ బూనినట్లు పలువురు తుంటరులు మిటారులతో మాటలాడుటకై తిరుగుచుండఁగాఁ గాంచి యావీథులయందుండు పెద్దలందఱు కాల వ్యత్యయమున కచ్చెరువందుచుండిరి. సాధువుల కిది కాలము కాదనియు భగవంతుఁడు కూడఁ దుంటరులకే తోడ్పడు

చున్నాఁడనియు నిశ్చయించి కలియుగమహత్త్వ మపారమని యూహించుచుఁ జూచుచుండిరి.

నాగోజీదత్త పురికొలుపఁగా సమ్మతించిన కృష్ణాకుమారి మఱుదినమే రాజమిత్రుఁ డుండుపల్లియకు మార్గాయాసమున కోర్చియైనఁ బోయెను. సాయంకాలమున కిశ్వేశకట మామె నాపల్లియకుఁ జేర్చెను. ఆయాసమున దేహమంతయు బడలి జ్వరమువచ్చెను. దానికింగూడ నోర్చుకొనఁజాలెను. దుష్ప్రియత్న మొంతయు మెచ్చఁదగినదియే కదా. సత్ప్రియత్నమున నింతటిపట్టుదల యుండకుండుట కలికాలమహిమమునఁ గాక మఱేమనవచ్చును? రెండుదినములాకృష్ణాకుమారిని ఆజ్వరము వదలలేదు. మూఁడవదినము శాంతించెను. మఱి రెండుదినములు లేవఁజాలక యుండెను. తుద కొక్కవారమునకుఁ దిరుఁగ గల్గెను. అప్పుడు వారిని జూడ సమయము కాదని మఱొక్క వారమందుండి యించుక యారోగ్యము కలుగఁగా నొకనాఁ డలంకరించుకొని సాయంకాలము కాకమునుపే ఆతఁడు ఫలాహారముచేసి కూరుచుండి యుండఁగాఁ బోయి చూచెను. తాంబూలము వేసికొనుచు నతఁ డొంటరిగ నుండెను. కృష్ణాకుమారి చేరఁగనే యతఁ డాదరము చూపుచుఁ గూరుచుండుమని పలికి మర్యాదగా మాటలాడసాగెను. నేత్రానందముం గోరువాఁడగుట దృష్టి సారించి చూచుచు మహాప్రీతితో మాటలాడుచుండెను. నాగోజీదత్త నేర్పినపాఠము తప్పక యొప్పగించెను. నవ్వుచు మాటలాడుట కామె యలవాటు పడినదిగాన నానవ్వును బెంచుచు నాతఁడు చూచుకొలఁదిఁ దన యంగసౌష్ఠవమును క్రమముగా వికసింపఁజేయుచు

నామాటలు ముగియఁగాఁ దన మాటలు మఱికొన్ని వానికి జతపఱచి యెట్లో నాలుగు గడియలు పుచ్చి బండి కాచి యున్నదని సారథి పిలువఁగా సెలవు పుచ్చుకొందునని చెప్పుచు లేచునపు డామె యఱచేయి యతని చేతని స్పృశించెను. దాన నతఁ డున్మత్తుఁ డయ్యెను. ఆవిధ మెఱిఁగి మఱింత త్వరితముగాఁ బయనము సాగించుచు నందనారామ వీథియందుఁగల నాగృహమును బావనము చేయ దయయుంచ వలయునని వేఁడెను. అదివఱ కనుకొనకపోయినను బనిని కల్పించుకొని రేపుగాని యెల్లుండిగాని రాఁదలంచితిని. అను కూలము దొరకిన నిందే యుండిన నేసును వత్తును. నే నే రావల సిన నేవియో పనులమూలమున నాలస్యమగు నేమో యని తడఁబడుమాటలఁ జెప్పెను. అతనిభావ మెఱింగిన యామిటారి బండి కాచియున్నది ముందుగాఁ దెలిసియున్న నుందును. బండివాని తొందఱ మెండు. లేకున్న మీసంగతి రెండుపూట లుండి కలిసిపోయిన బాగుండును. ఈబండిలోఁ గూరుచుండి రాఁగా దేవా మదరి జ్వరము వచ్చి పదిదినములు చాల బాధ పడి మీయాశీర్వచనమున బ్రదికి మిమ్ము దర్శింపఁగల్గితినని యాశగల్పించుమాటలఁ దనసీటు తెలిపెను. ఆరాజమిత్త్రుఁడు దొరకినదిరా స్వామీ యనుకొనుచు వైద్యము తెలిసినవాని వలెఁ జేయిపట్టుకొని చూచి నేను మందిచ్చెదను. ఉండుమని బండివానిని బిలిచి యెంత యద్దె యనినైన నడుగక నాలుగు రూపాయ లిచ్చి సాగనంపి యామెవస్తువులన్నియుఁ దన యింటనే యునుపఁ బంచి యుండే యుండుమని ప్రార్థించెను. ఆమె యెట్టకేల కంగీకరించి తనయునికికి వేఱుగా నొకబాగ

మడుగఁగా నిండే యుండవచ్చును. నేను వేఱొకచోటనుందు నని బతిమాలెను. ఇఁక నిన్ను నలిపెదను లే యనుకొనుచు నాకులుకులాడి తమరున్న బాధయే లేదు. అంతకంటె భాగ్యము కలదా యని నవ్వెను. ఆగదియందే యామె యుండ ననువు పడెను. సాయంకాలము బయలఁదిరుగునలవాఁటుగల యారాజ మిత్రుఁ డాదిన మద్దాని మాని యథేష్టాలాపముల దానిం గూడి కాలము పుచ్చెను. ఆయన వెంటనే భుజించెను. ఆగది యందే యతనిశయ్య యామెకొసంగఁబడినందున శయనించెను. మఱుదినము సాగవలసిన ప్రయాణము మఱియెనిమిదవదిన మామె పురికొల్పఁగా సాగెను దత్త చెప్పనక్కఱలేకయే కృష్ణాకుమారిమూలమున నతనిచెవి కెక్కెను. కీలుబొమ్మవలె నతఁడున్నవాఁడుకాన నందుల కంగీకరించెను. బ్రహ్మచారిణియు రాజమిత్రుఁడు కలిసియే ప్రయాణము సాగించిరి. సాయం కాలము దారియం దొకసత్రమున గడపి మఱుదినము సాయం కాలమునకు శైలపురమును జేరిరి. ఆబండి శాశ్వతబ్రహ్మ చారిణియింటికడకే పోయెను. ఎవ్వరును జూడకయుండ నతఁ డిల్లు ప్రవేశించెను. బస భోజనాదికము నందే సాగెను. నవ రాత్రము లాకృష్ణాకుమారిసంగతిం గడచెను. మఱుదినము కషాయము త్రాగి రాజదర్శనమునకుం బోయెను. "బంగారు వంటికోమటి సంగీతము మఱఁగి బేరసారము లుడిగెఁ" అన్న పద్య మీరాజమిత్రునకు సరిపోయెను. పాప మాతఁడు నాగోజీ దత్త తనతో మాటలాడకమునుపే కృష్ణాకుమారిమాటలకే మోసపోయి యీకార్యమును జక్కఁజేయుదునని ప్రతిన చేసెను. రాజగృహమున కరుగునపుడు శీఘ్రముగా దయ

చేసిన నాప్రియసఖి మంగళాంబ తమ్ము దర్శింపఁ గుతూహల పడుచున్నది మధ్యాహ్నము మన యిందు వేఁడుకగాఁ గాలము గడుపుదము దయచేయుఁడని నవ్వుచు వేఁడఁగా మంచిదని యతఁ డంగీకరించి పోయి యాపూట రాజుగారు వేఁటకుఁ బోయినందున మరలి వేగమ వచ్చి బ్రహ్మచారిణియింటఁ బ్రవేశించెను.

భుజించి యించుక విశ్రమించి లేవఁగాఁ దానును లేచి యామిటారి తనసఖియగు మంగళాంబను బిలువఁబంపెను. ఆమెయుఁ బదిదినములుగాఁ గృష్ణాకుమారిం గానక వెఱ్ఱి యెత్తిన ట్లుండునది గానఁ బరుగున వచ్చెను ఇరువురు వేఱొక తావున మాటలాడుకొనిరి. మరల నారాజమిత్రునికడ కరిగిరి. ఆతఁ డొంటరిగా నుండెను. చందనతాంబూలము లర్పించి యతనిపంపున నందుఁ గూరుచుండిరి. బ్రహ్మయు రాఁగూడదని యాజ్ఞయయ్యెను. వీథితలుపు టంగున బిగించిరి. తాంబూల మందిచ్చుచుఁ గృష్ణాకుమారి యీబీద రాలే నాకుఁ బ్రియసఖి. ఆఱవప్రాణ మీమె నాకని నమ్ముఁడు. తమ రించుక దయ యుంచిన మేమిరువురము మిమ్ము మఱువక కృతజ్ఞత నేదో యొకవిధమునఁ దెలుపుకొనుచుందుము. ఇవి పైమాటలు గావని నమ్ముఁడు. అని తా నేదో యొకపనికొఱకై లేచిపోయెను. మంగళాంబయు రాజమిత్రుఁడు నుండిరి. తొలుత నామె యనుమానించెనుగాని మఱుక్షణమునకు సరిపడఁగా నిశ్శంకముగా నందుండి యతనితో తనపనిం దెలిపెను. ఆతఁ డత్యంత సంతోషమున నంగీకరించి యన్యోన్యసహకార మావశ్యకమనియు దాని చేఁగాని కార్యములు కావనియుఁ దెలుపుచు

నామె యాశయమును దెలిసికొని కృష్ణాకుమారి వచ్చుదాఁక నేవో సల్లాపములచేఁ గాలము సుఖముగాఁ బుచ్చుచుండిరి. ఇంచుమించుగా నాలుగైదుగడియలకు వచ్చి యామిటారి గృహచ్ఛిద్రములవలన మనస్సు విసిఁగినదనియు నింత మంచి కాలమును గూడ వృథచేసెననియును దెలిపెను. ఆతఁ డందు లకు వగచి నీకుంగూడఁ బరితాపమా? స్వహస్తపరహస్తములఁ బరోపకారము చేయుచుఁ జేయించుదానవుకదా యని మెచ్చి యేఁబదిరూపాయల నొసంగెను. వాని నందుకొని కన్నుల కద్దుకొని పదిలపఱచి వచ్చి యిట్టివి మఱి యెన్ని యిచ్చిన నా చెలి కుపకారముచేసినంతసంతోషము నాకీయఁజాలదనఁగా బ్రహ్మ చారిణీ! నీచెలితోఁ గలిసి యింతసేపు మాటలాడితిని. ఆమె యభీష్టము నెఱవేఱిన దనుకొనుము. మీవంటి యుత్తమ కాంతలమూలమున నాజన్మము సార్థకమయ్యెను. పరోపకార మునకుఁ గదా మనము పుట్టినది. అది సాగినది. ఇఁక నాపని నెఱవేర్చెదనని బీరములు నాలుగు పలికి యాకొఱఁత పగలు పుచ్చి రాత్రి యందే సుఖనిద్ర చేసి రాజు రాకకొఱకు వేచి యుండెను.

# తొమ్మిదవకళ.

పద్మావతి రాజసోదరుని గాంచుట.
మంగళాంబ యువరాజు నాశ్రయించుట.
రాజమిత్రుఁడు రోగి యగుట.
హారిగిరి మిట్టిపాటు. పెద్దల ప్రయత్నము సాగకుండుట.

ప్రియంవద యొగురుచుంబోయి నగరమున వెదకి వెదకి పద్మావతియు దాసు విహారమునకై పోవుచుండఁగాఁ గాంచెను. వారు కార్యాంతరమునఁ బోవుచున్నందున నిల్లుమూసి తాళము తీసి యింట నుండుమని నాలుగడుగులు వెనుకకు వచ్చి తుద కది వేఁడఁగా నింటికి వచ్చి దాని నునిచి పోయి కొంతరాత్రి కాఁగా వచ్చిరి. కుమారుఁ డందెవరియింటికో పోవుచు నా రాత్రి యందే యుండునని చెప్పి పోయినందున వారు సావకాశముగా వచ్చి భుజించి ప్రియంవదకు నన్నముపెట్టి శైలపుర వార్తల నడుగుచు నెట్లో హాయిగా నారాత్రి గడపిరి. మఱు దినమే ప్రయాణమని పద్మావతి గట్టిగాఁ జెప్పఁగా విధిలేక దా నంగీకరించి ప్రయాణయత్నముచేసి యామువ్వురిని బంపెను. ప్రియంవద తమరు వచ్చిన చాలమేలనఁగా నేదో పనిచెప్పి గుట్టుగా తప్పించుకొనెను. ప్రియంవద యేమన్నను బలుకక తుదకు కన్నీరు విడిచి కొంతకాలము రాఁజాలనని చెప్పి తాను మరలి యింటికింబోయెను. ఎట్లో వారు మూవురు శైలపురముఁ జేరిరి.

వేఁటాడి రాజు నగరమును జేరెను. మిత్రుఁడు దర్శనార్థము వేచియున్నవాఁడని తెలియఁగనే రమ్మని సెలవిచ్చి కాల్యకృత్యములు తీర్చుకొని కూరుచుండి యింతలో మిత్రుఁడు రాఁగా నిష్టాలాపముల వినోదించుచుండెను. ఇరువురును భుజించి వేడుకఁగా మాటలాడుచుండఁగా మిత్రుఁడీవిషయమును జెప్పఁగోరి ఉపసచివుని నిర్ణయించువిషయమున నేమే నభిప్రాయపడితిరా యని ప్రశ్నింప నింతదనుక నావిషయమై యాలోచింపలేదనియు ముందావిషయము నాలోచింపవలసి యున్నదనియుఁ దెలిపెను. రాజుభావ మిట్టిదని తేలనందున నారాయణమూర్తి త్రిపాఠి యిందులకుఁ బనికివచ్చునని నాభావము. పెక్కండ్రాతనిం బ్రేమించుచున్నారు. నాయాశయమును దెలుపవలయుననియే యిపుడు వచ్చితినని విన్నవించెను. ఎవరిమూలమునఁ దెలిసికొంటివి? అని రాజడిగెను. శాశ్వత బ్రహ్మచారిణి లోనగుపతివ్రతాశిరోమణులు చెప్పఁగా విన్నాఁడనని మిత్రుఁడు తెల్పెను. వారిపరిచయము మీకెట్లు కలిగిన దను ప్రశ్నమునకు దైవికముగా నని యుత్తర మీఁబడెను. సావకాశముగా నాలోచింపవలసి యున్నదని రాజు పలికి యింతలో మంత్రి దర్శనార్థము వేచియున్నాఁడనువార్త రాఁగా మిత్రుని బంపి లోపలికిం బోయెను.

మిత్రుఁడుత్సాహ మంతగా నప్పటిభాషణమునుబట్టి లేకున్న నున్నయట్లే నటించుచుఁ గృష్ణాకుమారియింటి కరుదెంచి చిఱునవ్వునఁ గార్యానుకూలమును దెలుపుచుఁ బరుండి సరసాలాపములఁ బ్రొద్దుపుచ్చెను. నాఁటివారిసంభాషణము కార్యానుకూలసిద్ధాంతముగ ముగిసెను. మఱుదిన ముదయము

ననే రాజమిత్రుఁడు ప్రయాణముచేయ నెంచెనుగాని యించుక శరీరాయాసము కల్గినందున నిలుపవలసి వచ్చెను. రాజవైద్యుఁడు రాజానుమతిని బరీక్షించి జ్వరాదులు కావనియు మూత్రనిర్బంధమునఁ గలిగిన వేఁడియనియుఁ దెలిపి యింకను బరీక్షించి స్త్రీసంబంధవ్యాధి యని తీర్మానించెను. అంతకుఁబూర్వ మాతని కట్టివ్యాధులు లేకుండుట యందఱె ఱింగియుండిరి. కాన నిది నివాసమహిమమునఁ గలిగినదని తలంచిరి. శాశ్వతబ్రహ్మచారిణియింట రాజమిత్రుఁ డుండుట నాగోజీదత్త యెఱింగి నాయనుమతి లేక యుండఁ గారణమేమని యూహించుచు స్త్రీలను నమ్మరాదని యీసడించుచు నటునిటు వీథులవెంబడి తిరుగసాగెను. ఆతనిమిత్రుఁ డొకఁడు విషయ మెఱిఁగి వెఱ్ఱివాఁడా! ఏల విచారించెదవు? నీవంటివాఁడే యతఁడని యెఱుంగుము. అట్టి కాంతారత్నము లోకరిమాటకు లొంగి యుండదు సుమీ! లేనిపోనియధికార మున్నదను కొనక యూరకుండుమని హెచ్చరింపఁగా నించుక శాంతి వహించెను.

రాజవైద్యునకు రహస్యముగాఁ గొంతధనమిచ్చి యీ వార్త యితరులకుఁ దెలుపవలదని ప్రార్థించి రాజమిత్రుఁడు చాల బలహీనుఁడగుట నిఁక నీపురమున నున్న మర్యాద దక్కదని తలంచి కృష్ణాకుమారియింటికిం బోయి ప్రీతిలేకున్న నున్న యట్లు మాటలాడుచుఁ దనకుండు బాధలఁ దెలిపి యేమూలమున వచ్చెనని యడుగ నామె మొగము చిట్లించి మగవారిని నమ్మరాదు గదా యనుబదు లిచ్చెను. మంగళాంబయు నపుడు చెంతనుండెను గాన నిం దెవ్వరిమూలమున రావలసుపడదు.

ఎందుండి వచ్చెనో తమరే యూహింపవచ్చునని నవ్వుచుఁ బలుక నిఁక నేమన్నను బాధయే యనుకొనుచు నాశైలపురము నందే వేఱొకతావున రహస్యముగా నుండి వ్రణచికిత్సలు చేయించుకొనుచు మందు పుచ్చుకొనుచుండెను. ఆవార్త యెట్లో నలుగురికిఁ దెలియక పోలేదు. ఎవరో వారియింటి కీవార్తఁ దెలిపిరి. సోదరుఁడు వచ్చి యుపచారము లొనరించి పిలుచుకొనిపోయెను. ప్రయాణసమయమునఁ ద్రిపాఠి కనఁ బడఁగా నయ్యా! పతివ్రతలయనుగ్రహమున మాయన్నఁగా రెట్లో బ్రదికిరని మాత్రము తెలిపి మఱేమియుఁ బలుకక బండియెక్కి పోయెను.

ప్రియంవద లోనగువారు శైలపురమును జామురాత్రి యగునపుడు చేరిరి. మంగళాంబ యిష్టభోజనమును సమకూర్చెను. మఱుదినము తనగృహము చేరి పద్మావతి ప్రాఁత మిత్త్రులను బిలువఁబంచి మాటలాడి గ్రామాంతరమునుండి కృష్ణాకుమారి యపుడే వచ్చినదని విని యామెరాకకై యువ్విళ్లూరుచుండెను. భుజంగద్వివేది విషయమంతయుఁ దెలిపి మరల వత్తునని పోయెను. కృష్ణాకుమారి పద్మావతిరాక విని సాయంకాలము వచ్చి మాటలాడుదునని వార్తనంపి సాయంసమయమున వచ్చెను. వారిరువురు మంగళాంబయుఁ గలిసి చాల సేపు మాటలాడిరి. కార్యమంతయు నీచేతిలో నున్నదని పద్మావతిని మంగళాంబ పొగడెను. శక్తివంచన లేక దేహమును నీపనికై దానముచేయుదునని యాకాంతామణి బదులిచ్చెను. అంతకంటెఁ గావలసినదేమని అంబ పలికెను. చేయవలసినపద్ధతి యిదియని కృష్ణాకుమారి తేటపఱచెను. దానికి వారిరువురు

నంగీకరించిరి. అంతలోఁ ద్రిపాఠి యరుదెంచుచు వీరిముందఱ నేదో కాలికిఁ దగిలినట్లుండఁగా నెగురఁబోయి పడెను. మొదలే నడుపఁజాలనివాఁడు. దానికిందోడుగాఁ బడెను. వానింగాంచి పద్మావతి మంగళాంబ మంచిపూజచేసినదికాదని తోఁచెడునని నవ్వెను. త్రిపాఠి లేచి వచ్చి తల్లీ యని పద్మావతిని సంబోధించి తమచేతిలో నాబ్రదుకున్నది. ముంచినను దేల్చినను మీదే భారమని చేతులు జోడించి ప్రార్థించెను. నేనంతయు మాట లాడుదును. నీవు పొమ్మని మంగళాంబ కసరివైచెను. దేవుఁడా యని యతఁ డరిగెను. ఇది యిట్లు చేయవలయునని తేటపఱచి కృష్ణాకుమారి యింటి కరిగెను. ప్రియంవద వచ్చి జానకీబాయి యిచ్చినపత్రిక నీయఁ జదువుకొని రేపుదయము వచ్చి మాట లాడుదునని చెప్పుమని యాదాసి నంపి మిత్రగోష్ఠి నారాత్రి గడపెను.

స్వగ్రామమును జేరిన రాజమిత్రుఁడు కృష్ణాకుమారి కొకపత్రిక వ్రాసి నాజబ్బునకుఁ దగినమందు పంపవలయునని కోరెను. ఎందో సంపాదించి పంపి తమయారోగ్యమునే కోరు చున్నదాననని బదులు వ్రాసి యిచ్చెను. ఆతనిమాట రాజు మనస్సులోఁ దలపోయుచుండెను. అంతదనుక నెవ్వరుగాని త్రిపాఠివిషయము రాజునకుఁ దెలిపినవారు లేరు. కావున సావకాశముగాఁ బరిశీలింతమని యతఁ డూరకుండెను. హరిగిరి పద్మావతిరాక నెఱింగి నాగోజీదత్తకడ కరిగి తెలిపి యిఁక రాజసోదరునిఁ బద్మావతిం జూచునుపాయమును బన్నుమని తెలిపెను. కృష్ణాకుమారిపై నించుక యనుమానపడినవాఁడు

కావున నంత శ్రద్ధగా బదులీయక పోఁగా నెఱింగి తదనుకూలముగా మాట్లాడి సమ్మతింపఁజేసి హరిగిరి యింటికింబోయెను.

గోస్వామి జానకీబాయి ప్రోత్సాహమున నీకార్యము సాధింపఁ గంకణముకట్టుకొని హరిగిరిని గలిసికొని కృష్ణాకుమారిమూలమునఁ బద్మావతిని రాజసోదరుని దర్శించునట్లు పురికొల్పెను. అది యెట్లు సరిపడునని యామె ప్రశ్నించెను. నాగోజీ దత్త యనుమానపడెనని యెఱింగిన కృష్ణాకుమారి యెట్లో మరల నాతనిం బిలుపించుకొని సరిఁజూచి కుందువాపి రాజసోదరుని దనయింటికి రప్పింపుమని హెచ్చరించెను. ఆతఁ డందుల కంగీకరించి రెండుమూఁడుదినము లాతని నాశ్రయించి యేదో యొకయుత్సవము జరుగునుగానఁ దమరు దయచేయవలయు నని ప్రార్థింపఁగా నాతఁడు సమ్మతించెను. స్థలనిర్ణయమున శాశ్వత బ్రహ్మచారిణి పేరెత్తి యంతకంటె మంచితావు దొరకదనియుఁ గాన భక్తులగృహముననే యాయుత్సవము జరపఁ దలంచితిననియుఁ దమరాకకుమునుంచే యెల్లవారలను దాంబూలమిచ్చి పంపించి తమకొఱకు వేచియుందుననియుఁ బ్రార్థించెను ఆతఁ డందులకు సమ్మతించెను ఆనాఁడు కృష్ణాకుమారియింట నేదో జయంత్యుత్సవమని పేరుపెట్టి పదిమందిని బిలిపించి తాంబూలము లిప్పించి గృహ మలంకరించి వేచి యుండెను. సూర్యుఁ డస్తమించినతర్వాత రాజసోదరుఁడు ఘోటకశకటాధిరూఢుఁడై వచ్చి వాకిట దిగి శుభాగమనము తెలుపఁగా లోనికరిగెను. అందెవ్వరును లేరు. అంతర్గృహమునఁ బ్రవేశింపఁగనే చాటుననుండు కృష్ణాకుమారి వచ్చి పూలహారము మెడలో వైచెను. దాని కానందించి కూరుచుండి పీఠాలంకా

రమును జూచుచుసుండి కృష్ణాకుమారి ప్రార్థింపఁగా మీఁది గృహమున కరిగి తిరిగి బాగున్నదని మెచ్చుకొనుచు నేవో చిత్తరువులం జూచుచుండ వీనిని వ్రాసినది జానకీబాయి యనియు నీనగరమున నున్నదియే యనియుఁ జెప్పి వారిపరి పాలనమును వినుతించి పీఠముపైఁ గూరుచుండ వేఁడగాఁ గూరుచుండెను. కృష్ణాకుమారి తానునిర్మించిన తాళవృంతమున విసరుచుఁ గన్నుగీటి ముందే పోయినదత్తగారిని బొగడుచు వారిమూలమునఁ దమ్ము దర్శింప నోచితిననియు నా ప్రియ సఖియుఁ దమ్ము సందర్శింప వేచియున్నదనియుఁ దెలిపి అక్కా పద్మావతీ! యని పిలిచి యామె యరుదెంచి నిలువఁబడఁగా మన మనుకొనిన మహారాజుగారు వీరే సుమా! యని పలుక నామెయుఁ దాంబూలరాగము గనఁబడుచుండఁగా నేటికిఁ బ్రభుదర్శనమైనదని వినయమునఁ బలికి తాళవృంత మందుకొని విసరుచుఁ బ్రక్కన నిలువఁబడి యుండఁగాఁ గృష్ణాకుమారి మెల్లఁగా జాఱఁగా పద్మావతియు నివి యవి వార్తలు తెలుపుచు నుండి తాంబూలమిచ్చి బీదయింటితాంబూలము వేసికొనుఁడని వేఁడిన నామందయానయిచ్చిన తాంబూలము నమలుచు నొంటరిపాటున మాటలాడఁగలిగినందులకు నానందించుచు నిష్టాలాపములఁ బ్రొద్దుపుచ్చి రేపు మాటలాడుదును. అనఁగాఁ దనమనవిని దెలుపుకొన సమయ మెపుడనఁగా నతఁ డూహించి రేపు దీపములు పెట్టినపిదప వత్తుననియు నితరులుండిన నీవు చెప్పఁబోవుమాట లాలకించిన బాగుండదనియుఁ దెలుపఁగా నాయింట నెవ్వరు లేరు. కొడుకు గలఁడు. అయినను దమరు దయచేసిన నితరులు వినకుండ మాటలాడుదును. దీపములు.

పెట్టినతర్వాత నా ప్రియదాసి ప్రియంవద వీధిమొదట నిలువఁ బడియుండి మిమ్ముఁ బిలుచుకొనివచ్చును. అని నందనారామవీధి నుండి తనయింటిదగ్గరకు వచ్చుమార్గమున రావలయునని తెలిపి సాగనంపెను. ఇంతలో సమయ మెఱిఁగి కృష్ణాకుమారియు నరుదెంచెను. ఇరువురును సాగనంపిరి. రేపుసాయంకాలమెపుడు వచ్చునా యని యతఁ డువ్విళ్లూరుచుఁ బోయెను. పద్మావతి నేర్పునకు సమయోచితచాతుర్యమునకుఁ గృష్ణాకుమారి మెచ్చుకొని అమ్మా! నాకొఱకు శ్రమంపడితివి. ఇంటికిం బొమ్ము. రేపుసాయంకాలము నేను రానేల? నీవే మాటలాడఁ గలవుగదా. పని యెట్లు నిర్వహింతువో యని యేవో నాలుగు మాటలు చెవిలోఁ జెప్పిపంపెను. మఱుదినము కొడుకును పగలు నిద్రపోకుండఁ జూచుకొనుచు, పెందలకడ నన్నము పెట్టి దీపములుపెట్టిన రవంత సేపటికి మంచముపఱచి నాయనా! పరుండరా. నిద్రపోదువుగాని. ఆవులించుచున్నావే అని జోకొట్టుచు నిద్రపుచ్చెను.

ఆయుదయమునుండి పద్మావతివృత్తి క్రొత్తదిగ నుండెను. తల యంటుకొనుటకుఁ బరిమళతైలము కృష్ణాకుమారి పంపెను. పైఠిణిఱవికయు నామెయే కుట్టించినది. పగలెట్లున్నను సాయంకాలమునఁ బద్మావతిని జూచుటకు రెండుకన్నులు చాలకుండెను. విధవరాలైనను సువాసినులను మించియుండెను. ముంగురులను హెచ్చుతగ్గులుగా నుండునట్లు తీర్చుటకు నాఁడుపడిన యామెశ్రమమునకు వేయినూటపదాఱు లిచ్చినఁ జాలవు. అద్దమునకు నాఁడుగలిగినంతపని యేనాఁడును గలుగ

లేదు. సాయంకాలమే భుజించి ఫలాహారముల నమరించి పెక్కు రీతులం జలతారుచీర తీర్చి కట్టి బాగున్నదా యని చూచు కొనుచు నింతకంటె మించినట్లు కట్టుదునని పట్టుదలతో మఱొకరీతిగా నాచీరను కట్టుచు నిట్లు పెక్కురకములుగా నలంకరించుకొనుచు, కొడుకు పెందలకడ నిద్రపోయినందుల కానందించుచుఁ గోటిదేవతలకు మ్రొక్కుచుఁ దనమిట్టిపాటు చూచి రాజసోదరుఁడు మూర్ఛపోవకుండునా యని నమ్ముచు క్షణమున కొక్కసారి వీధివైపునకు చూపులు నిగుడించుచుఁ బ్రియంవదను బిలుచుచు ఆసుఁగ్రోవిలోనిదారమువలెఁ దిరుగు చుండెను. బలే సెబాస్! నీసొగసు మెచ్చవచ్చునమ్మా యని ప్రియంవద మెచ్చుచుండఁగా పట్టరానిసంతోషమున నుబ్బుచు రాజసోదరునిరాకకై వేచియుండెను.

దీపములు వెలిఁగించువేళ మించెను. ఇంక నిందే చచ్చి యున్నావా. పోలేదా యని ప్రియంవదను గసరివేయఁగా నేలనమ్మా! రవంత తాళుము. వారును రావలదా. నలువురు నిండ్లకు వచ్చువేళకదా యిది. ఇపుడు వారు వత్తురా? కనిపెట్టి యుండి పిలుచుకొనివచ్చి నీయింట వారిని గట్టివైతునని నచ్చఁ జెప్పి యిదె వెడలుచున్నాను. జాగ్రత్తగా నుండుము. ఆవు పాలు తీసియుంచితివి కదా. అన నవి యన్నియు నేనెఱుఁగు దును. నీవుపోయిరమ్మా యని తొందఱించెను. పద్మావతి సందడి నెఱింగి యాదాసి యుత్తరమువీధివెంటఁబోయి నందనారామ మును గలియుచోట నిలువఁబడి యుండెను. రాజసోదరుఁ డానాఁడు ముఖక్షౌరముచేసికొని భుజించి నాలుగుగడియల

రాత్రికాఁగా శయనగృహమున కరిగి యలంకరించుకొని యొంటరిగా బయలు వెడలెను. పద్మావతికి తిరుగలేక కాళ్లు చూడలేక కన్నులు నొచ్చెను. నిలుపఁబడలేక ప్రియంవద యలసెను. అంతలో నొంటరిగా వచ్చెను. చీఁకటి కాలము. ఆవీథి మొదట నొకదీపము కలదు. అది యంధతిని తిరస్కరించుచుండెను. అందున్న ప్రియంవద నమస్కరించెను. ఆతఁడానందపడి దాసివెంటఁబోయిన బాగుండదని ముందుగాఁ బొమ్మని పంపి దానిని జూచుచుఁ బోయెను ఒంటరిగా దాసి రాఁగా నాపద్మావతి నిరాశచేఁ గూలఁబడెను. ప్రియంవద వచ్చుచున్నాఁడు వచ్చుచున్నాఁడు. పదపద యనఁగాఁ దడఁబడుచు లేచి పరుగిడఁబోయి మరల క్రిందఁబడెను. ఏమిగ్రహచారమమ్మా యని దాసి హెచ్చరించుచు చీర సవరించుచుండఁగా రాజసోదరుఁ డరుదెంచి నిలువఁబడఁగా దాసి వచ్చి దయచేయుఁడని పిలుచుకొనిపోయి పాదములకు నీరు తానే తెచ్చి యిచ్చి పద్మావతి చాటున నుండి యిచ్చినవలువచే తడి యొత్తి సెలవుపుచ్చుకొందును. వేచియుందును. అని తలుపువేసికొని పోయెను. తలుపు గడియవేయు నెపమున వచ్చినపద్మావతి ముసిముసినగవుల నారాజసోదరునకు మర్యాదచేసి లోపలికి దయచేయవలయునని ప్రార్థించి కూడఁ బిలుచుకొనిపోయెను. ఇరువు రేకాంతస్థలముననుండి యిష్టాలాపములు మొదలగు వానిచే నేకత్వమునొందిరి. ఆరాత్రి యొకగడియగా వారికిం గనంబడియె. రేపు మరల వచ్చి మాటలాడినఁగాని భావములనుకూలింపవని యారాజసోదరుఁడు వెడలిపోయెను.

మూఁడునాలుగుదినము లావరుసగ వారిరువురును గొలువుం బుచ్చిరి. పద్మావతిభావము నాతఁడును, ఆరాజసోదరునిభావము నామిటూరియును జక్కఁగా నెఱుంగఁజాలిరి. కార్య మిఁక ఫలింపకపోవునా యని యాలసిమాటలంబట్టి యాయెమ్మెలాఁడి గ్రహించెను. ప్రియంవదను నించుకబహుమానమిచ్చి యాతఁడపుడపుడు వచ్చుచుం బోవుచుండునని వాగ్దానము పద్మావతికి నిచ్చెనుగాని యించుక రోగము సోఁకినందున దానిం జెల్లింపఁ జాలకపోయెను.

హరిగిరి నాగోజీదత్త యనువారిరువురు సకలప్రయత్నముల నొనరించి యువరాజును పూర్ణాంబయింటికిఁ బిలుచుకొనిరాఁగల్గిరి. మిటూరులసమాజమున నొకసభ జరపఁబడెను. దానిని దిలకించుటకు దయచేయవలయుననియే వారిని బ్రార్థించిరి. ఏవో నాలుగుతీర్మానములు ప్రతిపాదించుట వానిని జర్చించుట తీర్మానించుట యనుకార్యములు సాగెను. నాఁటి చర్చలో మంగళాంబ ప్రధానస్థానమును వహించెను. సభయనంతరము మంగళాంబ యువరాజును గొనియాడి పూలహారమున నలంకరించెను. ముందే యనుకొన్నవిధముగాఁ బద్మావతి లోనగువా రొకరొకరుగాఁ దొలఁగిరి. పూర్ణాంబ యింటరిగానుండు యువరాజునకు మంగళాంబం జూపి యీదీనురాలిప్రార్థన మాలకింపవలయునని వేఁడెను. చిఱునవ్వున నంగీకార మాతఁడు తెలిపెను. ఏకాంతమునఁ గూరుచుండఁ దగిన గదిలోని కిరువురు పంపఁబడిరి. పూర్ణాంబ యుపదేశానుసారము మంగళాంబ తనయుద్దేశము తెలిపెను. తనమగని

నాపదమున నిలుపవలయునని గట్టిగాఁ జెప్పఁదగినసమయమునఁ జెప్పెను. వారిరువురే యున్నందున నిష్టాలాపములకు గొదువ లేకుండెను. బల్లివలె గోడచాటుననుండి పూర్ణాంబ విని యొగిరిపడుచుండెను. ఒక్కజాము మాత్రమే వారిరువురు నాగదియందుండి సల్లాపములఁ గాలమును గడుపఁగలిగిరి. మంగళాంబయం దత్యంతప్రీతిగలిగి యువరాజు తనశక్తి నెల్ల నుపయోగించి పనినెఱవేర్చెదనని వాగ్దానమొసఁగి మఱి కొన్ని విషయములు మాటలాడవలయుననియు నొక్కదినమున నేనవియన్నియుఁ దెలుప వలనుపడదనియు రేపు కనఁబడిన బాగుండుననియు నింతలో తాను జేసిన ప్రయత్నమునకు ఫలమెంత కలిగినదో తెలుపుదుననియు నాశగలుగఁ బలికెను. మరల మనము కలిసికొను టెక్కడనని యడుగఁజాలక మంగళాంబ తలవంచుకొనియుండ నదియే మంచిసమయ మనుకొని పూర్ణాంబ ప్రవేశించి యీపేదరాలి వేఁడికోలు నంగీకరించి సరసముగా మాటలాడఁదలంచిన ప్రభువులయభిప్రాయ ముత్తమోత్తమమని పొగడి రేపు రెక్కడికి పద్మన్నను బిలుచుకొని వత్తురనియుఁ దమరే దయచేసిన నితరులకుఁ దెలియక యుండఁ గలసంవిధానము నొనరింతుననియు వేఁడెను. అంతఃపురమున కించుకదూరముగా సత్రమునకు నుత్తరముగా నుండుమేడకు రాత్రి భోజనానంతరము రావలయుననియు నందుఁ గలిసికొని మాటలాడి యీప్రియసఖికోరికను దీర్తుననియు వాగ్దానము చేసి వెడలిపోయెను. ఆమఱుదినము మంగళాంబను బిలుచుకొని పూర్ణాంబ యామేడకుంబోయి వారిరువురు మాటలాడు

కొనఁగా నాలకించుచుఁ గార్యానంతరము మంగళాంబను బిలుచుకొని వచ్చుచుండెను.

ఇట్లు పద్మావతియు మంగళాంబయు రాజుగారిసోదరుల నాశ్రయించి దేహాయాసముల కోర్చి పాటుపడుచుండిరి. ఈనడుమ తుంటరులు కొందఱు ప్రయత్న మిట్లున్నదని తెలియనివిషయములు తెలిసినట్లు తెలుపుచు నామిటారులతో మాటలాడుచుఁ బోవుచుండిరి. ఎవరిపనులను వారు చక్కఁ బెట్టుకొనుచుండిరి. మిటారులనీటు చూడ శక్యముగాక యుండెను. ఏవీథిన నెవరు మాటలాడుచున్నను వీరిప్రస్తావమే సాగుచుండెను. ఇరువురు రాజసోదరులు మిటారులకు లోఁబడిరి. కావున సమయోచితముగా నన్నకు నుపసచివపదమునకు మిక్కిలి యర్హుఁడు త్రిపాఠి యని తెలిపిరి. వారు తుంటరులఁగూడి తిరుగుచుండుట యెఱింగినవాఁడయ్యు రాజు వారిమాటల నాలకించెను. మిత్రుఁడు కూడ నీత్రిపాఠిపేరే చెప్పెఁగదా యనియుం దలంచెను.

నాగోజీదత్త యీసందడిలో నొకకొంతధనము సంపాదింపఁగోరి యొకనాఁడు హరిగిరితో మాటలాడుచు మన మిటారు లెంత ప్రయాసపడినను గానుక చెల్లింపకయున్నఁ గార్యము కాదని రాజుకడనుండు నొకమిత్రుఁడు నాకుఁ దెలిపెనుగాన నాప్రయత్నముచేసిన రేపే యాపని నిప్పింతునని తేటపఱచెను. త్రిపాఠి కావిషయముం దెలిపిరి. మంగళాంబ యెవరుగాని ఋణముగా నిచ్చిన వారిమేలు మఱువననియుఁ గ్రమముగాఁ నని నమ్మఁ బలికెను. పూర్ణాంబయుఁ గృష్ణా

కుమారియుఁ గనురెప్ప లెగురవైచిరి. హరిగిరి యాధనము నిచ్చుట కంగీకరించెను. రాజుకడనుండు నొకయుద్యోగికడ కరిగి యతనికి ధనమిత్తుమని యాశఁ గల్పించి యీకార్యమును సాధింపవలయునని నాగోజీదత్త యాతనిం గోరెను. అతఁ డంగీకరించి నజరుపెట్టనున్న రాజంగీకరింపఁడని తేటపఱచెను. నజరనఁగా నెంత యనుప్రశ్నమువచ్చెను. తక్కువ మొత్తము అయిదువందలు రజతముద్రికలనియు నంతకంటె నిరువది నాలుగు స్వర్ణముద్రికలు నజరుపెట్టిన మర్యాదగా నుండు ననియు నెంతప్రయత్నమైనను జేసి కార్యము నెఱవేర్తుననియు నీకష్టమునకుఁ బ్రతిఫలము గావలయుననియుఁ జెప్పి మూఁడు వందలు వెండిముద్రలు కావలయుననియు నంతకుఁ దగ్గిన నాకడకు రావలదనియు గట్టిగాఁ జెప్పెను. నాగోజీదత్త యందుల కంగీకరించెను.

నారాయణమూర్తి త్రిపాఠి హరిగిరికి పత్రము వ్రాసి యిచ్చి నాకుదొరకినధనమున నిబ్బుణము తీఱునంతదనుక రెండు భాగములు మీకిచ్చుచు నొక్కభాగమున సంసారమును జరపు కొందుననియు యావజ్జీవము మీకు దాసుఁడనై యుందు ననియుఁ బ్రమాణముచేసెను. హరిగిరియింటి నాశ్రయించి యుండునని మంగళాంబ లేగి పల్కెను. మీపనులు నావిగాఁ గనుచుండునని పూర్ణాంబ శపథములు పల్కెను. ఈపని నెఱవేఱినచో నాతోడ్పాటు మీకెంత గల్గునో చూచెదరు గాక యని కృష్ణాకుమారి నవ్వుచుఁ బలికెను. త్రిపాఠి పని ముగించిన నేనెట్లు మిమ్ము మెప్పింతునో చూడుఁడని పద్మావతి

వాక్రుచ్చెను. నాపద్దు గెలిపించిన నేనెట్లు మిమ్మెల్ల నలరింతునో చూడుండని జానకీబాయి భాషించెను. పార్వతీబాయి లోనగు మిటారులు నట్లే పలికిరి. ఇన్నిమాటలు విని హరిగిరి యాత్మ లాభము నపేక్షించి వృద్ధియొక్కించి ధనమిచ్చెను. దొరకినదే చాలునని త్రిపాఠి నాగోజీదత్త కప్పగించెను. అతఁ డించుక సంగ్రహించి మంగళాంబ పద్మావతి లోనగువారితోఁ జెలిమి గలిగినందులకే సంతోషించుచు రాజుకడనున్న మిత్రునకు వాగ్దానప్రకార మించుక తక్కువగానే యిచ్చి చేతులుపట్టు కొని యింతకంటె దొరక లేదని బతిమాలెను. మాటకర్పుగదా ధన మిది చాలులే యని తృప్తిపడి రాజునకు సమయోచిత ముగా నాగోజీదత్త దర్శనార్థము వేచియున్నాఁడని తెలిపి వారియనుమతిని రమ్మని వార్తనంప దత్త ప్రవేశించి మర్యాదగా మ్రొక్కి స్వర్ణముద్ర లిరువదినాలుగు కానుక పెట్టి యీమాట ఆమాట మాటలాడి వెడలిపోయెను.

శైలపురమునఁగల పెద్దలు కొంద ఱట్టియుద్యోగమున కర్హుఁడుకలఁడని రాజునకుం దెలిపిరి. సోదరు లిరువురు మిత్రుఁడు నాగోజీదత్త మిత్రుఁడగు తనయుద్యోగియు గట్టిగాఁ ద్రిపాఠినిగురించి చెప్పినందునఁ బెద్దలమాటలఁ ద్రోసిపుచ్చి త్రిపాఠి కాయుద్యోగమిచ్చెను. ఆదినమున మిటారులయుత్సాహమునకు హద్దులేదు. సీతాపతిగోస్వామి జానకీబాయికటాక్ష వీక్షణములకు, నాగోజీదత్త కృష్ణాకుమారి ప్రేమసంభాషణ ములకు, యువరాజు మంగళాంబయొరచూపులకు, రాజసోదరుఁడు పద్మావతిపరిరంభమునకు, హరిగిరి పూర్ణాంబమధుర

వాక్యములకు, పంటుపులు పార్వతీబాయిలోనగువారి సల్లాపములకును గుఱియై కృతార్థులైరి.

మఱుదినము మిటాయలసభ సాగెను. అందీతీర్మాన మేకగ్రీవముగా నామోదింపఁబడి రాజునకుఁ బంపఁబడియెను. "ఉపసచివస్థానము నారాయణమూర్తి త్రిపాఠిగారి కొసంగినందులకు శైలపురమునఁగల మిటాయలసభవా రెంతయు నానందించి తమకృతజ్ఞతను బ్రభుశిరోమణులకుఁ దెలుపుకొనుచున్నారు." ఈతీర్మానము బంపఁగా రాజు సంతొషించెను. అతరుణమున నారాజుచెంత మిత్రునిబంధు వొకఁడుండెను. ఎల్లవాడు పని వినినతర్వాత రాజునకు దానివృత్తాంతము నెఱింగించి శాశ్వత బ్రహ్మచారిణి యగుకృష్ణాకుమారిమూలమున మీమిత్రుఁడు రోగపీడితుఁడై లేవఁజాలకయున్నాఁడని తెలుపుచుఁ దక్కిన మిటాయలవృత్తాంతమంతయుఁ బూసగ్రుచ్చినట్లు తెలిపెను. సోదరు లీవిషయమునఁ జెప్పినపలుకుల స్మరించి ముక్కుమీఁద వ్రేలుంచుకొని యెంతపని సాగినది? అని విచారించెను. గతజలసేతుబంధనము కదా యని చెంతనున్నయతఁ డోదార్చెను.

కొలఁదికాలమునకే నాగోజీదత్త రోగియు దరిద్రుఁడునై రాజునకు దూరముగా నుండవలసినవాఁ డయ్యెను. సీతాపతిగోస్వామియు జానకీబాయిప్రవర్తనమునకు నేవగించి రోగపీడితుఁడై ధనమంతయు నశింప మర్యాద మాయఁగా శవమువలె నుండెను. యువరాజు సతనితమ్ముఁడును మంగళాంబాపద్మావతులయనుగ్రహములకుఁ బాత్రులై యశః

కాయములఁ జెలంగుచుండిరి. దూరముననున్న మిత్రుఁడు రాజదర్శనమునకు రాఁజాలక సిగ్గుపడుచుఁ గృష్ణాకుమారి ప్రసాదమున స్వర్గమున నిరోగిగా నుండవచ్చునని పోయెను. నారాయణభట్టు మంగళాంబ తనను గార్యాంతమునందు మన్నింపక పోఁగాఁ జింతించుచుఁ జెప్పుకొనఁదగని వ్యాధులు సోఁకినందున వెతలపాలయ్యెను. భుజంగద్వివేది తనయవివేకమునకుఁ జింతించుచుఁ బద్మావతి మఱియొకరి నాశ్రయించుటకు వగచుచుఁ దనకుండునండ వ్యాధి వృద్ధికాఁగా నలువురు నవ్వఁగా నుద్యోగ మూడిపోవఁగా దానును నమ్మి చెడితిఁగదా యని చింతింపసాగెను. పురుషోత్తమదాసు పద్మావతీమూలమున నున్న పరువు పోవఁగా మరల శైలపురమునకు రాఁజాలక యందే దుఃఖములపాలై చివుకుచుండెను. ప్రియంవద తనపని కందఱు మన్నింపకపోఁగాఁ దుద కావీధి నుండఁజాలక యెచ్చటికో పోయెను. పద్మావతి చెలికాండ్రు పెక్కండ్రు కాఁగాఁ దన గుట్టు బయలుపడఁగా నెవ్వరుగాని సజ్జనులు తన్ను భోజనమునకుఁ బిలువకపోవఁగా సంపాదించినధనము వ్యయముకాఁగా దరిద్రురాలై వగచుచుండెను. మంగళాంబ తనమూలమున యువరాజు చావఁగా భర్తకు నుద్యోగమైనను బూర్వపు రోగము వృద్ధియై యతఁడు నగుబాట్లకు లోనుకాఁగాఁ దల వంచుకొనవలసినదయ్యెను. కృష్ణాకుమారి శాశ్వతబ్రహ్మచారిణి యన్న పేరు సార్థకమే యని నలువురునవ్వఁ దన్నుఁజూచువారు తక్కువకాఁగా బీదరాలయి తనదురుద్యమమునకు ఫలము తోడనే కలిగెఁగదా యని దుఃఖింపసాగెను. పూర్ణాంబ తన మూలమున నిట్టిపనులు సాగుచున్నవని నలువురు నిందింపఁగా

మంచముపట్టెను. హరిగిరి సాధునిందలకుఁ బాత్రుఁడై క్షయరోగము పీడింప దివంగతుఁడయ్యెను. మిటారులసభ క్రమముగా నస్తమించెను. రాజు తనయకార్యమునకు దుఃఖించుచు దైవికముగా విపత్పరంపరలు తన్నలముకొనఁగా నెల్లరాశ్చర్యపడునట్లు పదభ్రష్టుఁడయ్యెను. త్రిపాఠి యాయుద్యోగమునకుఁ దగఁడని యెల్లరు నిందింపఁ గ్రొత్తరాజు తన్ను సమ్మానింపకపోఁగా దానిని వదలుకొని ఋణబాధల నలఁగసాగెను. దీనినంతయుం గాంచి శైలపురమునఁగల పెద్దలు భగవంతుఁడు కలికాలమునఁ గర్మఫలముల నాలస్యములేక యొసంగునని నమ్మిరి. అప్పటికి దుష్ప్రయత్నములు ఫలించినను దుదకు చేటు వాటిల్లఁజేయకపోవను సిద్ధాంత మెల్లరకుఁ దెల్లమయ్యెను. “మిటారులనీటు తుదకు వారికిని వారివారికిని జేటు” అనునది స్పష్టమయ్యెను.

సమాప్తము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
వావిళ్ల ప్రెస్సున ముద్రితము.—1937.